




చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |

చందాలు పంపవలసిన చిరునామా :

విస్డమ్
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004

# ఈ సంచికలో

అగస్టు 1984



తెలుగు 'విస్‌డమ్'కు ఇది మూడవ సంవత్సరం

## ధ్యానం

### ఆలోచనలు ఎలాంటివైతే మనిషి అలాంటి వాడు!



జేమ్స్ ఎలెన్

హృదయంలోనూ, ఆలోచనలలోనూ, చేతలలోనూ స్వచ్ఛత మనిషిని ఉదాత్తుణ్ణి చేస్తుంది. మరింత శక్తి, మరింత మంచితనం, మరింత ఆనందం కలిగించే ఉదారమైన ఆలోచనలకు అది దారి తీస్తుంది. ఉదార భావాలనూ, ఉత్తమ శాంతినీ, ఉజ్జ్వల విజ్ఞానాన్నీ చేకూర్చే సాధనాలు ఆర్తి, ధ్యానం, ప్రపత్తి! 'మనిషి ఆలోచనలు ఎలాంటివైతే మనిషి అలాంటి వాడు!' మంచి ఆలోచనలు మన నుంచి మనల్ని రక్షిస్తాయి. మన తప్పుల నుంచీ మన యాతనల నుంచీ మనల్ని కాపాడుతాయి ఆలోచనల సరళిలో కొత్తదనం కొత్త మనిషిగా మార్చేస్తుంది

## సంపాదకుని పేజీ

### ఆడిన మాట నిలబెట్టుకో!



చేసిన వాగ్దానం నిలుపుకోడం పిల్లలు అలవరచుకోవాలి. ఆడిన మాట ఎన్నడూ తప్పకూడదు. ఎవరికైనా ఏదైనా వాగ్దానం చేస్తే వారు మన మీదే ఆశ పెట్టుకుని ఉంటారు. ఆ వాగ్దానం నెరవేరకపోతే వట్టి అవిశ్వసనీయుల క్రింద మనల్ని వారు జమకడతారు.

జీవితంలో ఎదురైన అనుభవాల వల్ల పిల్లలకంటె పెద్దలు ఆశాభంగాలను తేలికగా తట్టుకొని నిలబడగలరు. అమాయికంగా ఇతరులు చేసిన ప్రతి వాగ్దానాన్నీ నమ్మే పిల్లలకు ఆ వాగ్దానం వారు నిలుపుకోరేమో అనే అనుమానమే రాదు. అందుచేత ఆశాభంగం ఎదురైతే వారు తలక్రిందు లయిపోతారు.

తల్లిదండ్రుల దృష్టాంతం పిల్లలకు చాలా ఉపకరిస్తుంది. నిజం చెప్పడం, అన్న మాట నిలబెట్టుకోడం, చేసిన వాగ్దానాన్ని నెరవేర్చడం చిన్నప్పటినుంచే పిల్లలకు నేర్పాలి.

"ఉన్నది ఉన్నట్టు చూడడం, చేసేది చెయ్యవలసిన విధంగా చెయ్యడం - ఇదే ప్రపంచ జ్ఞానం!" -పి. ఇస్టోలె

ఉదాహరణకు - ఫలానా టైమ్‌లో వస్తా మని ఎవరితో అయినా చెప్పి, ఆ సమయానికి వెళ్ళలేకపోతా రనుకోండి సకాలంలో ఆ సంగతి వారికి తెలియజెయ్యాలి. వాళ్ళు మీ కోసం పడుగాపులు పడి కూచునేట్టు చెయ్య కూడదు. ఒక్కసారే వారు మీమాట నమ్మ తారు; ఆ తరువాత జన్మలో మళ్ళీ మీ మాట నమ్మరు. మీ గౌరవం అడుగంటడానికి పూర్తిగా బాధ్యత మీదే!

మొహమాటం కొద్దీ ఒకప్పుడు 'కాదు' అనలేకపోవచ్చు; కాని, 'అలాగే!' అని మాత్రం అనకండి. వారి అభిప్రాయంతో నిజంగా మీరు ఏకీభవించ లేకపోతే వారు మిమ్మల్ని అర్థం చేసుకుంటారు. మీనిజా యితీని మెచ్చుకుంటారు కూడా!

ఆడిన మాట నిలబెట్టుకునేవారు ఈ నాడు చాలా అరుదుగా కనిపిస్తున్నారు. అందుకే మనుష్యుల మధ్యా, జాతుల మధ్యా అపనమ్మ కాలూ, అపోహలూ పెచ్చుపెరిగి పోతు న్నాయి. అగ్రిమెంట్‌లు వ్రాసుకునేటప్పుడు ఎలాంటి లొసుగులూ లేకుండా అన్ని జాగ్ర త్తలూ తీసుకుంటారు. అయినా ఆ ఒప్పం దంలో అంగీకరించిన దానికి విరుద్ధంగా చాలాసార్లు ప్రవర్తిస్తూ ఉంటారు వివిధ జాతులూ, వివిధ రాజకీయ నాయకులూ రోజూ ఎన్నెన్ని వాగ్దానాలు చేయడం లేదు? ఎన్నిటిని వారు నిలబెట్టు కుంటున్నారు?

అరుదుగా అయినా కొందరు ఇప్పటికీ కనిపిస్తారు - వాళ్ళు మాట అంటే మాటే! 'ఒకే మాట ఒకే బాణం, ఒకే పత్ని' అని కీర్తిగన్న శ్రీరామచంద్రుని వంటి మహ

## బొమ్మలలో హాస్యం

### మోడరన్ కొడుకు




నీయులు ఇంకా అక్కడక్కడ లేకపోలేదు. 'సంథా రఘురాముడు' అని తెనాలి రామకృష్ణ కవి పాండురంగ మాహాత్మ్యంలో ఒక పాత్రను వర్ణిస్తారు. చేసిన ప్రతిన నిలబెట్టుకో డంలో ఆయన రాముడంతటి వాడు - అని!

ఇతరులు మాట నిలబెట్టుకోవాలి అని మనం కోరితే ముందుగా మనం ఆడిన మాట తప్పకూడదు పూర్తిగా మనం నమ్మదగిన మనుష్యులు చాలా తక్కువమందే కనిపిస్తారు. ప్రతివాడూ తన విషయం వదలిపెట్టి ఇతరులు మాత్రం మాట నిలబెట్టుకోవాలి అని కోరుతూ ఉంటాడు. ఆత్మోన్నతికి ఆరంభ పాఠం నీతోనే ఆరంభం కావాలి నిన్ను నీవు చక్క దిద్దుకొని, నిటారుగా నిలబడగలిగితే, లోకం లోని దుష్టులలో కనీసం ఒక్కడైనా తగ్గు తాడు!

"రోగికి ప్రాణం ఉన్నంతవరకూ బ్రదుకుమీది ఆశ పోదు" —సిసిరో

# పీజా టవర్ ప్రత్యేకత

ప్రక్కకు వాలి ఉన్న పీజా టవర్ ఆకర్షణ దానిలోని అసమగ్రతే! 1174 లో ఈ టవర్ నిర్మాణం ఆరంభమైంది. బురద నేలలో



62 అ.ల లోతున రాతితో పునాది నిర్మించారు. చెట్ల మొదళ్ళను ఊత స్తంభాలు (piles) గా పాతారు. ఇన్ని చేసినా ఆ టవర్ స్వల్పంగా దక్షిణ దిశగా వాలి ఉందని త్వరలోనే గుర్తించారు. జరిగిన పొరపాటును చక్కదిద్దుకోడానికి మేస్త్రీలు దక్షిణపు వైపున గేలరీల ఎత్తు పెంచారు. తరువాతి సంవత్సరాలలో మరి కొన్ని సర్దుబాట్లు కూడా చేయబడ్డాయి. అయినా ఆ టవర్ మరింత దక్షిణంగా వాలింది.

వాస్తవానికి దక్షిణ దిశగానే వాలి ఉన్నా దక్షిణపు వైపున కల్పించిన అదనపు ఎత్తు వల్ల ఉత్తరం వైపుగా కూడా వంగినట్టు అది కనిపిస్తుంది. 179 అ ల ఎత్తున్న ఈ టవర్ లంబరేఖకు 14 అ.లు ప్రక్కకు వాలి ఉంది.

పీజా టవర్‌ని కాపాడడం కోసం ఇంజనీర్లు వివిధ ఉపాయాలు సూచించారు. అయితే పడిపోకుండా దీనిని కాపాడగలిగినప్పటికీ దక్షిణ దిశగా వాలి ఉండడాన్నీ, ఉత్తరానికి మెలి తిరిగి ఉండడాన్నీ సరి చేసి సూటిగా నిలబెట్టడం మాత్రం ఎవ్వరికీ సాధ్యం కాదు.

## ముఖచిత్ర వ్యాఖ్య

(జూన్ 1984)



"కపటము లేని నవ్వు
పరిమళించే మల్లె పువ్వు!"
—కె. రవి శంకర్, హిందూపూర్,
అనంతపురం జిల్లా.

* * *

"ముసి ముసి నవ్వుల చెల్లెమ్మా!
నీ ముఖాన బొట్టేదమ్మా?"
—కె. మేలగిరి రావు, నారాయణ పేట.

* * *

"రెండు జెళ్ళ సీతా?
ఒక చెవేం మూత?"
—బత్తుల గోవింద రావు, సరియాపల్లి.

"ఆశే అనాథల పాలిటి పరమాన్నం!" - తేలీజ్

# వారిని గురించి తెలుసుకోండి

మిఖాయిల్ షోలోఖోవ్: 'అండ్ క్వయెట్ ఫ్లోస్ ది డాన్' (డాన్ నది ప్రశాంతంగా ప్రవహిస్తూంది) అనే 4 సంపుటాల



పెద్ద నవల వ్రాసి, 1965 లో దానికి నోబెల్ బహుమతి అందుకున్న రష్యన్ రచయిత. 'టాల్‌స్టాయ్' వ్రాసిన సుప్రసిద్ధమైన 'వార్ అండ్ పీస్' పద్ధతిలో వ్రాసిన పెద్ద నవల ఇది. ఇప్పటికి 50 లక్షల పైచిలుకు ప్రతులు ఖర్చయాయి. దృఢకాయులైన కోసక్ జాతి వారినీ,బలమైన వారి రాగద్వేషాలనూ వర్ణించే ఈ నవల ఇంగ్లీషులోకి కూడా అనువాదం చేయబడింది.

* * *

ప్రొ॥ హీరేన్ ముఖర్జీ: విద్వాంసుడు, చరిత్ర రచయిత, రాజనీతిశాస్త్ర వేత్త, సంస్కర్త. లాయరు, ప్రముఖ పార్లమెంటరీ వక్త. ఆయన రచనలలో ప్రసిద్ధ మైనవి: ఇండియా స్ట్రగుల్స్ ఫర్ ఫ్రీడమ్ (భారత స్వాతంత్ర్య పోరాటం), 'రిమెంబరింగ్ మార్క్స్' (మార్క్స్ సంస్మరణ), 'ది లాండ్ ఆఫ్ సోవియెట్స్' (సోవియెట్ భూమి), 'ఏ హిస్టరీ ఆఫ్ ఇండియా' (భారత దేశ చరిత్ర).

* * *

స్వరణ్ సింగ్: జలంధర్ (పంజాబు) లో మొదట ఒక లాయర్‌గా జీవితం ప్రారం

---

## భావ పరిచయ పోటీ

(జూన్ 1984)



"తండ్రి కోటీశ్వరుడు!
తనయుడు యోగీశ్వరుడు!"

—ఎమ్. సునీత్ కుమార్,
చిలకలూరిపేట.

* * *

"ధన చింతన ఇహానికి!
దైవ చింతన పరానికి!"

—బి.వి.ఆర్. భాస్కరరావు,
కుంకలగుంట, గుంటూరు జిల్లా.

* * *

"కరిగిపోయేది ధనం!
తరిగిపోని సంపద ధ్యానం!"

—పి.ఆర్. హరినాథ్, అనంతపురం.

---

"సన్మానాలు అందుకోడంలో కాదు, వాటికి తాను తగుదు ననే ధీమాలో ఉంది గౌరవం!" -అరిస్టాటిల్

భించి, క్రమంగా, భారత విదేశాంగ శాఖ మంత్రి స్థాయికి ఎదిగారు. 1957 లో పంచ వర్ష ప్రణాళికలకు ఋణాలు మంజూరు చేసే విషయమై సోవియట్ యూనియన్‌తో సంప్రదించటానికి పోయిన డెలిగేషన్‌కు ఆయనే నాయకుడు. 1962-63 లో కాశ్మీర్ సమస్య విషయమై పాకిస్థాన్‌తో 6 పర్యాయాలు సంప్రదింపులు జరిపిన డెలిగేషన్‌కి కూడా ఆయనే నాయకత్వం వహించారు.

* * *

ఫ్రాంక్ రాబర్ట్ మొరేస్: ఇండియా పత్రికా రచయితలలో అగ్రగణ్యుడుగా ప్రపంచ విఖ్యాతి పొందినవాడు. ఆయనే రచనలలో స్వతంత్రత, విశిష్ట భావనాశక్తి కనిపిస్తాయి. 'ఏరియల్' అనే కలం పేరుతో ఆయన వ్రాసిన ఆదివారం 'కాలమ్' అంత ర్జాతీయ ప్రసిద్ధి పొందింది.

* * *

కేశబ్ మహీంద్ర: ప్రత్యేక శిక్షణ పొందిన, బిజినెస్ మేనేజ్‌మెంట్‌లో ఉన్నత విద్యార్హతలు గడించిన ప్రముఖ పారిశ్రామిక వేత్త. అమ్మకాల పెంపకం, విస్తరణ, ఉత్పాదకత వంటి విషయాలలో ఆధునిక విధానాలను అవలంబిస్తున్న వారు. అల్యూమినియమ్, టైర్‌లు, మెషినరీ, జీప్‌లు, తోళ్లు, కెమికల్స్, వస్త్రాలు, ఉక్కు, అగ్గిపెట్టెలు, ట్రాక్టర్‌లు, టైప్ రైటర్‌లు మొదలైన నానా విధ పరిశ్రమలను ఆయన నిర్వహిస్తున్నారు.

పాల్ రోబ్సన్: జగద్విఖ్యాతి పొందిన అమెరికన్ నీగ్రో గాయకుడు. ఫుట్‌బాల్ క్రీడాకారుడు; పౌర హక్కుల సమర్థకుడు; లాయరు. మధురమైన అతని గాత్రంతో ప్రజలను ఆయన ముగ్ధుల్ని చేశాడు. తన తండ్రి ఒక 'బానిస' అనీ, అమెరికా ఈ స్థితికి రావడానికి ఆయన వెట్టి చాకిరీ చేశా డనీ ఒక సందర్భంలో ఆయన అన్నారు. 1976 జనవరి 22 వ తేదీన తన 77 వ ఏట ఆయన వీర మరణం పొందారు.

---

## పాఠకుల అభిప్రాయాలు

(జూన్ 1984)

★

"ఆలోచన నీ తెలివిని పెంచుతుంది;
ఆచరణ నీ బలాన్ని పెంచుతుంది!!

—వి. వేణుగోపాల్, జగ్గయ్యపేట.

* * *

"కులం వద్దు, గిలం వద్దు - 'మాటల్లో'
కులం జూపి సీటు లెక్కు - 'చేతల్లో!'"

—జి. లక్ష్మీనారాయణ, ఉలిచి,
ప్రకాశం జిల్లా.

* * *

"సంగీతం మాష్టారు చెప్పారు:
'స రి గ మ ప ద ని'
ట్రాఫిక్ పోలీసు చెప్పాడు:
'సరిగ పద మని'

—మొలుగు కమలాకాంత్,
విస్సన్నపేట, కృష్ణాజిల్లా.

"లోకంలో మిక్కిలి పుష్టికరమైన ఆహారం
రెండు మాటల్లో ఇమిడి ఉంది: 'చాలండి - ఇంకొద్దు'" —కేట్ స్విఫ్ట్

# నవ్వు

## 'ఇదే నాకు మొదటిసారి!':

దొంగ: చేతులు పైకెత్తు!—లేకపోతే?

ప్రయాణీకుడు: ఊఁ—లేకపోతే? ఏం చేస్తావ్?

దొంగ: నన్ను తికమక పెట్టకు! ఈ వృత్తిలో ఇదే నాకు మొదటిసారి!

* * *

## 'కార్'ల యుగం వల్ల కలిగిన లాభం:

టీచర్: సునీల్! కార్ల యుగం రావడం వల్ల కలిగిన ఒక లాభం చెప్పు!

సునీల్: గుర్రాల దొంగతనం దాదాపు అంతరించిపోయినట్టే సార్!

* * *

## ఫాక్టరీలో పని చేసేవారు:

విజిటర్: ఎంతమంది మీ ఫాక్టరీలో పని చేస్తున్నారు?

ఫ్యాక్టరీ యజమాని: పదిమందిలో పట్టుమని ఏ ఒక్కడో ఒళ్ళు వంచి పని చేస్తున్నాడు.

* * *

## వట్టి బకెట్ తెచ్చావేం?:

"ఇవాళ ఆవు పాలివ్వ లేదా? వట్టి బకెట్‌తో తిరిగి వచ్చావేం?" అని అడిగాడు యజమాని దానికి నౌకరు జవాబు: "ఇవ్వక పోవడం ఏం బాబూ! 4 లీటర్ల పాలూ, ఆ పైన ఒక గట్టి తన్నూ కూడా ఇచ్చింది!"

* * *

(మిగతా 58 వ పేజీలో)

## మన పల్లెలలో టపా బట్వాడా



ప్రస్తుతం ఇండియాలోని 95 శాతం పల్లెలలో రోజూ టపా బట్వాడా అయే సౌకర్యం ఉంది. ఉత్తరాలు బట్వాడా చెయ్యడానికీ, పోస్టు పెట్టెలలో వేసిన ఉత్తరాలు పోగుచేసుకుని రావడానికీ రోజూ మన పోస్టు బంట్రోతులు తిరుగుతున్న దూరం భూమి, చంద్రుల మధ్య ఉన్న దూరానికి రెండింతలు! తన 30 ఏళ్ళ సర్వీసులోనూ ప్రతి పోస్ట్ బంట్రోతూ దాదాపు లక్షమైళ్ళ దూరం నడుస్తాడు!

"'ప్రశాంతి' కి చెల్లెలు 'అమాయికత్వం'!" —ఏ. మాల్కెల్

# సర్ ఆర్థర్ కాటన్

డా॥ డి. ఆంజనేయులు

"సుజలాం సుఫలాం
మలయజ శీతలాం
సస్య శ్యామలాం...

అని మధురమైన పదాలతో, కళ్ళకు కట్టే మనోహర దృశ్యాలతో భరత మాతను వర్ణిస్తుంది బంకించంద్ర చటర్జీ వ్రాసిన 'వందేమాతరమ్' అనే దేశ భక్తి గీతం!

'సుజల' — (జల సమృద్ధి కలిగింది) అయినంత మాత్రంచేత ఏ దేశం అయినా 'సుఫల' (పుష్కలంగా పంట పండేది), 'సస్యశ్యామల' (పైరులతో పచ్చ పచ్చగా కనిపించేది) అవుతుం దనే నమ్మకం ఏమీ లేదు. సముద్రంలోకి వ్యర్థంగా ప్రవహించి పోయే నదులలోని నీరును అడ్డగించి, కాలువల ద్వారా దానిని చేలలోకి పారించి, పాడి పంటలతో దేశాన్ని కల కల లాడేట్టు చెయ్యా లంటే అందుకు మానవ ప్రయత్నం ఎంతయినా అవసరం!



జనరల్ సర్ ఆర్థర్ కాటన్

'గత శతాబ్ది మధ్య భాగంలో దక్షిణ భారత దేశంలో అలాంటి భగీరథ ప్రయత్నం చేసిన ఏకైక వ్యక్తి ఎవరు?' అని అడిగితే — 'రాయల్ ఇంజనీర్స్' బృందానికి చెంది, ఆ నాటి చెన్న రాజధానికి చీఫ్ ఇంజనీర్‌గా పని చేసి, 1863 లో పదవీ విరమణ చేసిన జనరల్ సర్ ఆర్థర్ కాటన్ అని ఎవరైనా తడుముకోకుండా జవాబు చెబుతారు. మన నదుల మీది ప్రధానమైన ఆనకట్టలు నిర్మించడానికి చాలా వరకూ ఆయనే కారణం! మన ప్రధాన నదు లన్నిటినీ ఒక దానితో, ఒకటి కలిపి దేశంలో అంతర్గత

## కిటికీలకు పన్ను

పెన్సిల్వేనియా (అమెరికా) రాష్ట్రంలో 1789 లో ఇళ్ళకు ఉన్న కిటికీల మీద పన్ను విధించేవారు కిటికీల సైజును బట్టీ, ప్రతి ఇంటికి ఉండే కిటికీల సంఖ్యనుబట్టీ ఆ యజమాని చెల్లించవలసిన పన్ను నిర్ణయించబడేది.

"అనుసరణను మించిన పొగడ్త మరోటి లేదు!" —సి. సి. కోల్టన్

నౌకాయాన సౌకర్యాలు పెంపొందించే ఒక బృహత్ పథకాన్ని గురించి కూడా ఆయన కలలు కనేవారు.

అనేక విధాలుగా ఆర్థర్ కాటన్ అసాధారణమైన వ్యక్తి. తన తండ్రికి ఆయన 10 వ కుమారుడు. చిత్రంగా ఆయన తండ్రి కూడా అలాగే సరిగా తన తండ్రికి 10 వ కుమారుడు! చిన్నప్పటి నుంచీ ఆర్థర్ కాటన్‌కి కాలువ లంటే ఇష్టం. వర్షం కురిసిన రోజున రోడ్లమీద చిన్న చిన్న కాలువలు సృష్టించి, వినోదిస్తూ ఉండేవాడు. 1803 మే నెల 15 వ తేదీన ఇంగ్లండ్‌లో ఆయన జన్మించారు. తన 15 వ ఏట క్రాయ్‌డన్ పటణం సమీపంలో ఉన్న ఆడిస్కోంబె సైనిక పాఠశాలలో ఇండియాలో పని చేసే సైనిక విద్యార్థిగా ఆయన చేరాడు. చురుకైన వాడూ, కష్టించి పనిచేసే స్వభావం గలవాడూ కావడం వల్ల 3 ఏళ్ళలోనే ఎలాంటి పరీక్షలూ ప్యాస్ కానక్కర లేకుండానే ఆయనను 'రాయల్ ఇంజనీర్స్' బృందంలో నియమించారు. 'రాయల్ ఇంజినీర్స్' చరిత్రలోనే అది అపూర్వమైన సంఘటన!

1821 లో మద్రాసు రాగానే ఆర్థర్ కాటన్ చీఫ్ ఇంజనీర్‌కు సహాయకుడుగా నియమింపబడ్డాడు. ఆ మరుసటి ఏడాది 'తటాకాల విభాగం' ఆయనకు వప్పగించారు. ఆ ఉద్యోగంలో ఆయన బాధ్యతలలో ఒకటి రామేశ్వరం సమీపంలోని పాంబన్ కనుమను సర్వే చేసి, దానిని అభివృద్ధి పరచడం. మరొకటి: మద్రాసులోని సెంట్ థామస్ మౌంట్ వద్ద మిలిటరీ భవనాలు కట్టించడం.

త్వరలోనే ఆయన దృష్టి నీటి వనరుల ఏర్పాటు (irrigation) వైపు మళ్ళి, ఆయన జీవితంలో అధిక భాగం అందుకే వినియోగించబడింది. మొదట కాటన్ 'కొల్లిడమ్' (కావేరి శాఖ) మీదా, తరువాత కావేరీ నది మీదా ఆనకట్టలు నిర్మించి, కావేరీ నదీ జలాలు తంజావూరు జిల్లాలోని భూములకు అందే ఏర్పాటు చేశారు. ఆ పథకం వల్ల ఆ జిల్లా చరిత్రలో ఒక నూతన అభ్యుదయ శకం ఆరంభమైంది. చెన్న రాజధానిలో తంజావూరే మిక్కిలి సంపన్నమైన ప్రాంతం అయి, బ్రిటిష్ సామ్రాజ్యంలో ఏ ఒక్క-

## 31 ఏళ్ళలో 120 యుద్ధాలు



1945 మొదలు 1976 దాకా ప్రపంచంలో మొత్తం 120 యుద్ధాలు జరిగాయి. వీటిలో 5 తప్ప తక్కిన వన్నీ యూరప్ బయట జరిగినవే! చాలావరకు ఈ యుద్ధాలు ఆసియా మధ్య ప్రాచ్యాలలోనే జరిగాయి. ఈ 120 యుద్ధాలలోనూ 64 గింటిలో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ రాజ్యాలవారి సాయుధ సైన్యాలు పాల్గొన్నాయి. 6 యుద్ధాలలో సోషలిస్ట్ రాజ్యాలు పాల్గొన్నాయి. 71 దేశాలలో జరిగిన ఈ 120 యుద్ధాలలో మొత్తం 84 దేశాల సైన్యాలు పాల్గొన్నాయి.

---

"'అజ్ఞానం' ఏ సమస్యనూ పరిష్కరించ లేదు!" —డిజ్రేలీ

జిల్లా నుంచీ రానంత రెవిన్యూ ఆదాయం ఆ జిల్లా నుంచి రాసాగింది.

రాత్రిం బవళ్ళు కష్టించి పని చేసినందు వల్ల విశ్రాంతి అవసరమై సెలవు మీద కొన్నాళ్ళు కాటన్ టాస్మేనియా వెళ్ళారు. అక్కడ మిస్ ఎలిజబెత్ లీర్‌మౌత్‌ను కలుసుకొని, సుదీర్ఘ కాలం కొనసాగిన ప్రేమ కలాపం పర్యవసానంగా 1841 లో ఆమెను వివాహం ఆడారు. ఆయన ప్రథమ పుత్రిక అక్కడే పుట్టింది (తరువాత ఆ కూతురే తండ్రి జీవిత చరిత్ర వ్రాసింది). అనంతరం సకుటుంబంగా ఆర్థర్ కాటన్ మద్రాసు తిరిగి వచ్చారు. రాగానే మద్రాసు నుంచి రెడ్ హిల్స్ దాకా చిన్న రైలు మార్గం నిర్మిం చడం, విశాఖ రేవు అభివృద్ధికి పథకం వెయ్యడం ఆయనకు వప్పగించారు.

తన జీవితంలో మిక్కిలి గొప్ప ప్రణాళిక అయిన గోదావరి ఆనకట్టను 1847 లో ఆయన చేబట్టారు. తరుచు కరువు కాటకాలకు గురి అవుతూ వచ్చిన గోదావరి జిల్లాకు నీటి వనరు కలిగించేందుకు గోదావరి కడ్డంగా కాటన్ 12 అ. ల ఎత్తూ, 2½ మైళ్ళ పొడవూ గల ఆన కట్ట నిర్మాణానికి పూనుకొన్నారు. ధవళేశ్వరం వద్ద ఆరంభించి గోదావరి లంకలలోని ర్యాలి, మద్దూరు, విజ్జేశ్వరాల మీదుగా 7,365 అ.ల పొడుగు కట్ట నిర్మించబడింది. ధవళే శ్వరం వద్ద ఆయనకు స్మృతిచిహ్నంగా నెల కొల్పబడిన నిలువెత్తు పాలరాతి విగ్రహం నేటికీ కనిపిస్తుంది. నల్లరాతితోనూ, తెల్లని సున్నంతోనూ ఆయన కట్టించిన ఆనకట్ట భాగాలు కొన్ని ఈ నాటికీ చెక్కుచెదరకుండ నిలిచి ఉన్నాయి.

గోదావరి ఆనకట్ట, కాలువలు, రోడ్ల మొదలైన వాటి నిర్మాణం 5 ఏళ్ళలో (1847-52) పూర్తి అయింది. కేవలం 1,65,000 పౌన్లు (రూ. 25 లక్షలు) మాత్రమే అందుకు ఖర్చయింది. అంతటి సంకీర్ణమైన బృహత్ పథకాన్ని అంత తక్కువ

---

## పసిపిల్ల ఏడుపువల్ల తల్లికి చెవుడు



తన పసిపిల్ల ఏడుపు వల్ల ఒక్కొక్కప్పుడు తల్లికి తాత్కాలికంగా చెవుడు రావడం కద్దు. శిశువు నోటి నుంచి 6 అం.ల. దూరంలో రోదన ధ్వనిని కొలిచి చూడడం వల్ల వారు చాలా తీవ్రమైన ధ్వనిని కలిగించ గల రని స్పష్టమైంది. అమెరికాలో ఒక తల్లి తన 11 నెలల శిశువు ఒక ప్రత్యేకమైన ధ్వని చేయడంతో తనకు తాత్కాలికంగా చెవుడు వచ్చినట్టు తెలియజేస్తూంది.

"చీమను చూసి నేర్చుకో -
పాటు పడడంలో ఉండే ఆనందం!" -ఓల్డ్ టెస్టమెంట్

ర్యయంతో నిర్మించడం నమ్మ శక్యం కాని విషయం. భారతీయ ఇంజనీరింగ్ ప్రతిభనూ. భారతీయ కార్మికులనూ వినియోగించి ఆ ఆనకట్టను కాటన్ నిర్మించారు. ప్రపంచంలో మిక్కిలి చౌక ఇంజనీరింగ్ విధానానికి స్థాపకుడుగా అందరూ ఆయనను కీర్తించారు. కృష్ణానది ఆనకట్ట నిర్మాణం ఆయన సాధించిన మరో ఘన విజయం. మద్రాసు ఓడరేవు అభివృద్ధికి కూడా ఆయనే బాధ్యులు।

గోదావరి ఆనకట్ట పూర్తి అయి, హెడ్ క్వార్టర్స్‌కు తిరిగి రాగానే వెంట వెంట ప్రమోషన్‌లు వచ్చి. త్వరలోనే ఆయన చెన్న రాజధానికి చీఫ్‌ఇంజనీర్ అయారు. ఇండియాలోని నదు లన్నిటినీ కలిపి దేశాంతర్గత నౌకాయానాన్ని పెంపొందించా లని ఆయన కన్న కలలు మాత్రం నేటికీ కలలుగానే మిగిలిపోయాయి.

ఇండియాలో పదవీ విరమణ చేసి ఇంగ్లండ్ తిరిగి వెళ్ళిన తరువాత కాటన్ దొర ఆరోగ్యం దెబ్బతింది. చేసిన సేవలకు తగిన గుర్తింపు రానందు వల్ల ఆయనకు కొంత మనో వ్యథ కలిగింది. కామన్స్ సభ తాలూకు కమిటీ ముందు జరిగిన విచారణలో ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టా రనే నిరాధారమైన ఆరోపణకు ఆయన సంజాయిషీ ఇచ్చుకోవలసి వచ్చింది. అయినా అచంచలమైన ధైర్యంతో ఆయన దాని నెదుర్కొన్నారు. ఇంగ్లండ్‌లో విశ్రాంతిగా గడిపే కాలంలో కూడా ఆయన మనస్సు ఎప్పుడూ ఇండియాలోని నీటి వనరులను గురించే మథనపడుతూ ఉండేది. 96 ఏళ్ళ పూర్ణాయుర్దాయం జీవించి, 1899 లో కాటన్ దొర తుదిసారి కన్ను మూశారు. ●

## 12 జతల కవలలను కన్న కానిస్టేబుల్

32 ఏళ్ళ వయస్సు గల యుగాండా దేశపు కానిస్టేబుల్ జాన్‌వాంగుసా గత 10 ఏళ్ళలోనూ తన 7 గురి భార్యల వల్లా మొత్తం 12 జతల కవల పిల్లలను కన్నాడు. వారిలో 10 మంది మాత్రం చనిపోయారు. తక్కిన పద్నాలుగురూ నిక్షేపంగా ఉన్నారు.

## మెదడు వినియోగించుకునే ప్రాణవాయువు



మనిషి శరీరం బరువులో అతని మెదడు బరువు కేవలం 15 వ వంతు మాత్రమే। అయినా అతడు పీల్చుకునే ప్రాణవాయువులో 5 వ వంతును అది వాడుకుంటుంది. శరీరం తీసుకునే కేలరీలలో కూడా 5 వ వంతు ఈ ప్రధానావయవం క్రింద ఖర్చవుతూంది.

"భోగట్టాకంటె 'ఆలోచన' మరింత ముఖ్యం।" -ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

# చరిత్రలోని వెలుగులు

## గిరాకీ పెంచిన ట్రిక్!

చాలా ఏళ్ళ క్రితం హారీ రైఖెన్‌బాఖ్ అనే అమెరికన్ ప్రకటన కర్త ఫ్రాన్సిస్ ఎక్స్ బుష్‌మన్ అనే సినీనటుని గిరాకీ పెంచా లనుకున్నాడు. ఒక ఫిలిం కంపెనీలో క్రొత్త కాంట్రాక్ట్ సంతకం చేయించేందుకు బుష్‌మన్‌ను వెంటబెట్టుకుని బయలుదేరే ముందు ఆయన తన జేబుల నిండా పెన్నీ నాణాలు నింపుకున్నాడు. న్యూయార్క్‌లోని 42వ వీథిగుండా పోతూ దారి పొడుగునా ఆ నాణాలు వెదజల్లడం మొదలు పెట్టాడు. వాటిని ఏరుకోడానికి పిల్లలూ, పెద్దవాళ్ళూ ఎందరో వారివెంట పడ్డారు. ఫిలిం కంపెనీ ఆఫీసు చేరుకునేసరికి వారి చుట్టూ పెద్దగుంపు తయా రయింది. వా రందరూ బుష్‌మన్ తాలూకు 'ఫాన్' లని నమ్మిన ఆ ఫిలింకంపెనీ వారు అంతవరకూ వారానికి 250 డాలర్లు మాత్రమే ఇచ్చేవారల్లా కొత్త కాంట్రాక్టులో వారానికి 1,000 డాలర్లు ఇవ్వడానికి సమ్మ తించారు.

* * *

## "ఇష్టం వచ్చిన చోట విరామ చిహ్నాలు పెట్టుకోమనండి!"

రిచర్డ్ బ్రిన్స్‌లీ షెరిడన్ బ్రిటిష్ పార్ల మెంట్ సభ్యుడు. ఒక సందర్భంలో స్పీకర్ ఆయన అన్న మాటలకు తన తోటి సభ్యునికి క్షమార్పణ చెప్పుకోవలసిం దని ఆదేశించాడు. అప్పుడు ఆయన ఇలా క్షమార్పణ చెప్పాడు: "స్పీకర్‌గారూ! గౌరవనీయుడైన సభ్యుడు అబద్ధాలకోరు అన్నాను ఆ మాట నిజం అందుకు నేను విచారిస్తున్నాను" తన క్షమా ర్పణలో తోటి సభ్యుడు తన ఇష్టం వచ్చిన చోట విరామ చిహ్నాలు పెట్టుకోవచ్చు నని ఆయన వివరించాడు. ('....అన్నాను' అన్న మాట తరువాత కామా పెడితే ఒక అర్థం, ఫుల్‌స్టాప్ పెడితే మరో అర్థం వస్తుంది.) ●

## క్రికెట్‌లో 100 సెంచరీలు కొట్టిన మొట్టమొదటి బాట్స్‌మన్

ఆస్ట్రేలియన్ క్రికెట్ ఆటగాడు సర్ డాన్ బ్రాడ్‌మన్ ఫస్ట్‌క్లాస్ క్రికెట్‌లో 100 సెంచరీలు సాధించాడు. ఆంగ్లేయేతర క్రికెట్ క్రీడాకారులలో మొట్టమొదట ఈ ఘనత సాధించినవాడు ఆయనే! ఆయన బాటింగ్ సగటు 99.94 పరుగులు. ఆయన కొట్టిన 100 సెంచరీలలో 400 పరుగులు దాటిన సందర్భం (452) ఒకటీ, 300 దాటిన సందర్భాలు అయిదూ, 200 దాటిన సందర్భాలు 37 ఉన్నాయి.

"నాకు తెలియనిది తెలియ దని చెప్పేందుకు నేను సిగ్గుపడను!" —సిసిరో

# విజ్ఞానవేదిక

## మిక్కిలి శక్తిమంతమైన దూరదర్శిని

మౌంట్ పోలమర్ (అమెరికా)లో నెల కొల్పిన సుప్రసిద్ధమైన 200 అంగుళాల 'హేల్ రిఫ్లెక్టర్ దూరదర్శిని' మనిషి కంటి కంటె 8 లక్షల రెట్లు ఎక్కువ శక్తి గలది.



ఆకాశంలో ఉన్న కోట్లాది నక్షత్రాలలో మనిషి కన్ను కొన్ని వేలను మాత్రమే చూడగలదు. ఈ రాకాసి దూరదర్శిని సాయంతో 800 కోట్ల నక్షత్రాలను స్పష్టంగా చూపి గుర్తించడం సాధ్యం అవుతూంది.

60 లక్షల డాలర్లు ఖరీదు చేసే ఈ దూర దర్శిని సాయంతో మనిషి ఆకాశంలోకి 7,03,88,352,00,00,000,00,00,000 మైళ్ళ దూరం దాకా చూడగలడు. ఈ 200 అంగుళాల భూతద్దంలో భూమి తాలూకు వాతావరణం కూడా పెద్దదై, భూమికి మిక్కిలి చేరువగా (2,39,000 మైళ్ళ దూరంలో) ఉన్న చంద్రుడి లాంటి ఖగోళాలను మరింత విశదంగా పరిశీలించడం సాధ్యం అవుతూంది.

ఈ రాకాసి భూతద్దాన్ని గాజుతో పోత పోయగలగడం ఇటీవలి కాలంలో సైన్సు సాధించిన ఘన విజయాలలో ఒకటి; 'కోర్నింగ్ గ్లాస్ వర్క్సు'లో పనిచేసే వారందరూ అత్యంత నిపుణంగా, మిక్కిలి కచ్చి

(మిగతా 51 వ పేజీలో)

## కూపస్థ మండూకాలు

తమిళనాడులో తిరునల్వేలి జిల్లాలోని శ్రీ వైకుంఠం అనే గ్రామంలో 12 అ.ల ఎత్తున్న మట్టి ప్రహరీ గోడల మధ్య 20 ఎకరాల కోట ఒకటి ఉంది. 1,000 ఏళ్ళుగా ఆ కోటలో నివసించే కొద్ది కుటుంబాల తాలూకు స్త్రీలకు ఆ కోట బయటి ప్రపంచం ఎలా ఉంటుందో తెలియదు. చనిపోయిన తరువాత తప్ప అక్కడి స్త్రీలు ఆ కోట గోడ దాటి బయటికి పోరు. అక్కడి ఆ కొద్ది కుటుంబాల వారి మధ్యే వివాహాలు జరుగుతూ ఉంటాయి.

" 'ఐశ్వర్యం' తో జతకట్టిన 'అజ్ఞానం' మరింత హేయం!" —ఐసెన్ హోవర్

## ప్రముఖులతో విజడమ్

# "యోగాభ్యాసం చెయ్యండి!"

(న్యూయార్క్, బొంబాయి నగరాలలో 'యోగ ఇన్‌స్టిట్యూట్'లు నడుపుతూ 84 ఏళ్ళవయస్సులో కూడా ఇంకా నిర్విరామంగా మానవసేవ చేస్తున్న శ్రీ యోగేంద్ర జీ 'విజ్‌డమ్'కు ప్రత్యేకంగా ఇచ్చిన ఇంటర్వ్యూ)



* ఆనందంగా జీవించడానికి తిరుగులేని సరళమైన ఉపాయం ఏది?

నిజాయితీగా జీవించడం!

* * *

* మిమ్మల్ని ఉత్తేజపరచిన రచయితలను కొందరిని చెబుతారా?

రవీంద్రుడు అన్నా, ఎమర్సన్ అన్నా నాకు చాలా ఇష్టం! అయితే వారి ప్రభావం మాత్రం నామీద లేదు.

* * *

* మీ మనస్సు దేవుడి వైపు ఎలా మొగ్గింది?

చాలా చిన్నతనంలోనే దేవుడంటే నాకు నమ్మకం కుదిరింది. దేవుణ్ణి నమ్ముతూ ఉన్న జనం మధ్య పెరగడం అందుకు కారణం కావచ్చు!

* * *

* మీ జీవితంలో మరపురాని అనుభవం ఏది?

యోగాభ్యాసంతో నా మొదటి పరిచయం.

## కెమిస్ట్రీలో 1983 నోబెల్ బహుమతి విజేత

కెనడా దేశీయుడైన ప్రొఫెసర్ హెన్రీ టౌబేకి కెమిస్ట్రీలో 1983 నోబెల్ బహుమతి ఇచ్చారు. స్టామ్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆ ప్రొఫెసర్ 'సేంద్రియ రసాయన' శాస్త్రంలో అందెవేసిన చేయి!

"జాతి చేసే అన్యాయం జాతి పతనానికి రహదారి!" —డబ్ల్యు. ఇ. గ్లాడ్‌స్టన్

* జీవితం నుంచి మీరు నేర్చుకున్న ముఖ్యమైన పాఠాలేవైనా మూడు చెబుతారా?

ఎవరికీ హాని కలిగించక పోవడం, నిజం చెప్పడం, నిరంతరం పరతత్త్వాన్ని అన్వేషించడం.

* * *

* ఆధునిక మానవుడిలో నరాల బిగువు ఎక్కువగా కనిపిస్తూంది. దీనిని అధిగమించడం ఎలా?

శరీరాన్నీ, మనస్సునీ విశ్రాంతిగా ఉంచుకోవాలి!

* * *

* 'భయాన్ని' జయించడం ఎలా?

ధైర్యాన్ని అలవరచుకుంటే 'భయం' అదే పోతుంది!

* * *

* జీవితంలో విజయం సాధించడానికి మీరు చెప్పే ఉపాయం ఏమిటి?

దృఢ సంకల్పం, పట్టుదల, పరిశ్రమ— వీటిద్వారా జీవితంలో విజయం సాధించవచ్చు!

* * *

* ఎదుటి వారి మనస్సు నొప్పించకుండా మనం ధర్మాన్ని అనుష్ఠించడం ఎలా?

ముఖ్యంగా మనకు లక్ష్యశుద్ధి ఉండాలి!

* * *

* మనస్సును కేంద్రీకరించడానికీ, ధ్యానం కుదరడానికీ ఉపాయం ఏదైనా చెబుతారా?

భావశుద్ధి, అంతర్ముఖిత్వం, నిశ్శబ్దం — ఇవి అందుకు తోడ్పడుతాయి.

* * *

* దయ్యాలలో మీకు నమ్మకం ఉందా?

వాటిని నమ్మేవాళ్ళకే దయ్యాలు కనిపిస్తాయి!

* * *

* జీవితంలో ఇంత ఆరోగ్యంగా, ఉత్సాహంగా మీరు ఎలా ఉండగలుగుతున్నారు?

నేను నిత్యం చేసే యోగాభ్యాసమే అందుకు కారణం!

## 'బ్లాక్‌విడో' సాలీడు కక్కే విషం



'బ్లాక్ విడో' అనే రకం సాలీడు ఒక రకం త్రాచుపాము (rattle snake) కక్కే విషం కంటె 15 రెట్లు శక్తిమంత మైంది. అయితే అదృష్టవశాత్తు తడవకు అది వెలువరించే విషం మనిషి ప్రాణాలు తీయడానికి చాలినంత ప్రమాణంలో ఉండదు.

"దురదృష్టం కంటె దుర్భరమైన కష్టం: 'కృతఘ్నత'" —నెపోలియన్

# మనం ఎంత దుబారా చేస్తున్నాం?

ఎన్. ఎస్. వెంకటరామన్

"అవసరాలు పరిమితం: ఆశలు అపరిమితం:" అంటుంది అర్థశాస్త్రం. అయితే ఒకప్పుడు 'భోగం' అనుకున్నదే



మరొకప్పుడు అవసరం అయే అవకాశం లేకపోలేదు. మన ఆశలను అదుపులో పెట్టుకుంటే మనమూ ఐశ్వర్యవంతులం కావచ్చు. అంతే కాదు; 'లోభి' అనిపించుకోకుండానే 'అవసరాల'లో కూడా మనం కొంత పొదుపు పాటించవచ్చు. రైల్వే ప్లాట్‌ఫారాల మీదా, రోడ్ల మీదా కనిపించే సిగరెట్టు పీకెలను చూస్తే నాకు ఆశ్చర్యం వేస్తూ ఉంటుంది - 'పొగ త్రాగేవారు తెలిసి తెలిసి చేజేతులా ఎంత దుబారా చేస్తున్నారా' అని.

ఒక సిగరెట్టు వెల 25 పైసలనుకోండి. చాలా మంది 2/3 వ వంతు సిగరెట్టు మాత్రమే - కొంతమంది సగం మాత్రమే - కాల్చి అవతల పారేస్తారు. 25 పైసలలో 3 వ వంతు 8 పైసలు. అంటే ఒక్కొక్క సిగరెట్టు కాల్చినప్పుడల్లా ఒక 8 పైసలు వృథాగా గిరాటు వేస్తున్నా రన్నమాట. రోజుకి ఒక వ్యక్తి ఒక పాకెట్ కాలుస్తాడనుకుంటే రోజుకి 80 పైసలు అతడు దుబారా చేస్తున్నట్టు. అంటే నెలకు రూ. 24 లు; సంవత్సరానికి రూ. 288 లు. ఇంకో విధంగా చెప్పాలంటే సిగరెట్లు ఉత్పత్తి చేసే ఫాక్టరీ తన ఉత్పత్తిలో 3 వ వంతు ఎవరికీ వినియోగపడకుండానే ఆదాయం ఆర్జిస్తూందన్న మాట.

నెలకు ఇలా దుబారా చేసే బదులు ఆ మొత్తం ప్రీమియమ్‌గా కడితే 25 ఏళ్ళ గడువులో 10,000 రూపాయలకు ఇన్సూరెన్స్ పోలసీ తీసుకోవచ్చు. ఒక్క సిగరెట్టు విషయంలోనే ఇంత దుబారా జరుగుతూంది. అదీ రోజుకి ఒక పాకెట్టు మాత్రమే కాల్చే

## మానవ నిర్మితమైన మిక్కిలి పెద్ద సరస్సు

ప. ఆఫ్రికాలోని వోల్టా సరస్సు ప్రపంచంలో మానవ నిర్మితమైన మిక్కిలి పెద్ద సరస్సు. 1965 లో పూర్తి చేయబడిన అకోసోంబో డామ్ నిర్మాణం వల్ల ఏర్పడ్డ సరస్సు ఇది. 1969 నాటికి దాని విస్తీర్ణం 3,275 చ. మైళ్ళు.

**"న్యాయం చెయ్యడంలో ఆలస్యం అన్యాయం క్రిందే లెక్క."** —డబ్ల్యు. ఎస్. లాండర్

వ్యక్తి విషయంలో!

గోల్డ్‌స్పాట్‌లాంటి పానీయం వెల రూ. 1-50 మొదలు రూ. 2 లు దాకా ఉంటుంది. దానిలో కనీసం 5 శాతం తాగకుండా అను గున వదిలేస్తారు. అలాంటివి ఎన్ని సీసాలు తాగుతున్నారో వాటిలో ఎంత వృథాగా వది లేస్తున్నారో, ఎంత డబ్బు అలా దుబారా అవుతూందో మీరే ఆలోచించండి! మద్రాసు, బొంబాయి, ఢిల్లీలాంటి నగరాలలో మంచి నీళ్ళు అపురూపం! హోటల్‌కి వెళ్ళి గ్లాసులో రెండు గుక్కలు తాగి తక్కిన నీళ్ళు అలా వదిలేస్తాం! ఎంతో నీరు అలా వృథా అవు తూంది.

ఫైవ్ స్టార్ హోటళ్ళలో జరిగే డిన్నర్ పార్టీలలో ప్లేట్లలో వదిలివేసే పదార్థాల విలువ లెక్కకట్టండి! కొందరు - అంతా పూర్తిగా తినకుండా అలా వదిలివేయడం 'టేబిల్ మేనర్స్' అని వాదిస్తారు. మన దేశంలో అలాంటి 'టేబిల్ మానర్స్' పాటించేటంత స్తోమతు మనకు ఉందా అని నాకు అను మానం! నిజానికి - నన్నడిగితే మన కెంత కావాలో అంతే ఆర్డర్‌చేసి, ఒక్క పిసరు కూడా ప్లేట్‌లో మిగుల్చకుండా తినడమే మన దేశంలో అలవరచుకోవలసిన ప్రశస్త మైన టేబిల్ మేనర్! ఇండియా లాంటి బీద దేశంలో ఇది చాలా అవసరం! ఆహార పదార్థాలను ఇలా వ్యర్థం చేసే ఈ పెద్ద మనుషులు దాన ధర్మాల దగ్గిరికి వచ్చేసరికి మళ్ళీ వెనుకాడుతారు. ఒక దుకాణాదారు నాకు తెలుసు - తను తిరిగి ఇవ్వవలసిన 2 పైసలూ 3 పైసలూ చిల్లర కాతాదార్లకు ఎన్నడూ ఇచ్చేవాడు కాదు. చాలామంది కాతాదార్లు దీనిని అంతగా పట్టించుకోరు. అలా ఉల్ఫాగా

## 'వినియోగదారు'ల ఉద్యమం ప్రవక్త



ప్రపంచంలో ఆహార, ఔషధ అధికారుల కంటె సుప్రసిద్ధ అమెరికన్ పరిశోధకుడు రాల్ఫ్ నాడర్ వినియోగదారులకు మరింత ఎక్కువ సేవ చేశారు. వినియోగదారుల పరి శ్రమలలో కనిపించే తక్కువ తూకం తూచడం, అధిక ధరలు వసూలు చేయడం, హానికరమైన పదార్థాలు కల్తీ కలపడం, నాసి రకం సరుకులు అమ్మడం లాంటి అవకతవ కల నెన్నిటినో ఆయన బట్టబయలు చేశారు. కొందరు ఆయనను బెదరించారు: కొందరు కోర్టు కీడ్చారు. అయినా - ఎవరి దగ్గిరా ఆయన తల వంచక పోగా, వినియోగదారు లను మోసగిస్తున్నందుకు వాళ్ళ చేత పరి హారం కూడా ఇప్పించారు.

"'అన్యాయం' పునాదుల మీద ఏర్పడ్డ రాజ్యం బ్రతికి బట్టకట్టదు!" -సెనెకా

వచ్చే డబ్బు కోసం ఆ దుకాణాదారుకి ప్రత్యేకంగా ఒక గల్లాపెట్టె ఉంటుందనుకుంటాను.

ఎక్కువ మొత్తంలో సరుకులు కొని, వాటిలో కొద్ది భాగమే వాడి, తక్కిన వాటిని వృథా చేసే సందర్భాలు కూడా నాకు గుర్తు వస్తున్నాయి. ఎక్కువ మొత్తంలో కొంటే ధర కొంత కలసివచ్చే మాట నిజమే; కాని తరుచు 'గిఫ్ట్ ఆఫర్' ప్రకటనలు చూసి మనం భ్రమపడుతూ ఉంటాం. ఆ ఇచ్చే బహుమతి చాలా స్వల్పమైంది. రూ. 25 లు ఖరీదుచేసే నూనె డబ్బా కొంటే 40 పైసలు ఖరీదు చేసే ఏ చెంచాయో గిఫ్ట్‌గా ఇస్తారు.

ఒకసారి మా యజమాని మా ఆఫీసుకి వచ్చే కవర్లు చెత్తబుట్టలలో పారవేయవద్దనీ, వాటిని చింపి ఒక క్లిప్‌లో పెట్టుకుంటే లోపలి వైపు తెల్లగా ఉండే భాగం మీద చిత్తుప్రతులు వ్రాసుకోవచ్చు ననీ మమ్మల్ని ఆదేశించాడు. ఈ చిన్న పొదుపువల్ల మా కంపెనీకి తెల్లకాగితం క్రింద పెట్టే ఖర్చులో ఎంతో కలసి వచ్చింది. ఆఫీసులో మనం పని చేస్తూ ఉండగా రోజూ ఒకటి రెండు పేపర్ క్లిప్‌లు మన చెయిజారి క్రింద పడడం జరుగుతూ ఉంటుంది. వంగి వాటిని తీయడానికి బద్ధకించి మరో క్లిప్‌తో పని జరుపు కుంటాం. వందలమంది పనిచేసే ఒక కంపెనీలో అలా వృథా అయ్యే క్లిప్‌లు ఎన్ని ఉంటాయో ఆలోచించండి. కొన్నేళ్ళ క్రితం నిజాయితీ పరుడైన మా ఆఫీస్ బాయ్ ఒక్క మా అంతస్తులోనే రోజూ ఆఫీసు ఊడ్చినప్పుడు వానికి దొరికే 30, 40 పేపర్ క్లిప్‌లు తెచ్చినాకు ఇస్తూ ఉండేవాడు. అలాంటి అనేక అంతస్తులలో పని చేస్తూ ఉండే ఆఫీసులో ఇలా దుబారా అయ్యే పేపర్‌క్లిప్‌లవల్ల ఎంత నష్టం వస్తుందో ఆలోచించండి!

ఫలశ్రుతి: 'చిల్లర శ్రీ మహాలక్ష్మి!' ●

## ఐఫెల్ టవర్‌లోని మెట్ల వరుస వేలం



ఐఫెల్ టవర్‌లో ఆదిలో నిర్మించిన వలయాకారపు మెట్ల వరుసలోని 20 సెక్షన్‌లు- రెండవ, మూడవ అంతస్తుల మధ్య ఉన్నవి- ఇటీవల పారిస్‌లో వేలం పాడగా 18,47,000 ఫ్రాంక్‌లకు అమ్ముడు పోయాయి. ఇటీవల చేపట్టిన ఆ టవర్ మరమ్మతుల కార్యక్రమం సందర్భంలో ఈ సెక్షనులను తీసివేసి కొత్తగా నిర్మిస్తున్నారు.

"కృత్రిమ వస్తువులను, ముఖ్యంగా - పరికరాలను సృష్టించే పరికరాలను సృష్టించడం 'తెలివి'!" —హెచ్. బెర్గ్‌సన్

# సుప్రసిద్ధ సేనానులు

## గిగరీ కె. ఝుకో

రెండో ప్రపంచ సంగ్రామ కాలంలో రష్యా తాలూకు ఎర్ర సైన్యానికి నాయకత్వంవహించి, జర్మన్ నాజీ సైన్యం మీద అఖండ విజయం సాధించి మార్షల్ గ్రిగరీ కోన్‌స్టాంటి



నోవిచ్ ఝుకోవ్ అశేష రష్యన్ ప్రజల నుంచీ జేజేలు అందుకున్నారు. మాస్కో, స్టాలిన్‌గ్రాడ్ నగరాల రక్షణలోనూ, జర్మన్ సైన్యాల లెనిన్‌గ్రాడ్ ముట్టడిని విఫలం చెయ్యడంలోనూ, పోలండ్ ద్వారా జర్మనీ లోకి ఎర్ర సైన్యాలను నడిపించి జర్మన్ రాజధాని నగరం బెర్లిన్‌ని పట్టుకోడంలోనూ, 1945 లో జర్మన్‌ల 'దాసోహాన్ని' (surrender) స్వీకరించడంలోనూ అద్భుతమైన సైనిక ప్రతిభను ఝుకోవ్ ప్రదర్శించారు.

మధ్య రష్యా (Central Russia) లోని స్ట్రెల్‌కోవా అనే కుగ్రామంలో ఒక పేద రైతు ఇంట 1895 లో ఝుకోవ్ జన్మించారు. ఒక చర్మాల వ్యాపారి వద్ద మొదట కొన్నాళ్ళు అప్రెంటిస్‌గా పనిచేశారు. మొదటి ప్రపంచయుద్ధం ఆరంభం కాగానే రష్యన్ జార్ సైన్యంలో సాధారణ సైనికుడుగా చేరారు. రెండేళ్ళు పనిచేశాక, అనారోగ్యం కారణంగా సైన్యం నుంచి ఆయనను పంపివేశారు. తిరిగి ఆరోగ్యం కోలుకునేసరికి రష్యాలో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారు. అప్పుడు ఆయన ఎర్ర సైన్యంలో చేరారు.

రష్యా అంతర్యుద్ధంలో ప్రతిభావంతంగా పోరాడి, ఝుకోవ్ ఆఫీసర్ అయారు. రష్యన్ సైనిక కళాశాల ఫ్రంజ్ అకాడమీలో

## 16 భాషలలో ముద్రించే కంప్యూటర్

పిలనీ (రాజస్థాన్) లోని 'ది బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ'లో తొలిసారిగా ఒక 'ఏకీకృత ప్రదర్శన విధానాన్ని' (unified display scheme) కనిపెట్టారు. దీనివల్ల ఒక వ్యక్తి కంప్యూటర్‌ని ఆపరేట్ చేస్తూ ఏక కాలంలో 16 భాషలలో ముద్రించబడిన జవాబులను రాబట్టగలడు.

"దేశంలోని విడి వ్యక్తుల విలువే దేశం విలువ." —జె.ఎస్. మిల్

కొన్నాళ్ళు శిక్షణ పొందారు. తిరిగి సైన్యంలో ఆఫీసర్‌గా చేరి పనిచేస్తూ ఉండగా స్పానిష్ అంతర్యుద్ధంలో ప్రధాన సైనిక పరిశీలకుడు (observer) గా 1936 లో స్టాలిన్ ఆయనను స్పెయిన్‌కి పంపారు. ఆ తరువాత 1939 మే నెలలో జపాన్ దాడికి గురి అయిన మంగోలియన్ రిపబ్లిక్‌కి సాయంగా పంపిన రష్యన్ సైన్యాలకు స్టాలిన్ ఆయనను నాయకుణ్ణి చేశారు. ఆ యుద్ధంలో ఝుకోవ్ జపాన్ వారి 6 వ సైన్యాన్ని పూర్తిగా తుడిచిపెట్టి, మంచూరియా దాకా జపాన్‌ను తరిమి తరిమి కొట్టారు.

రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో ఏక సమయంలో ఇటు రష్యన్ సర్వ సైన్యాధ్యక్షుడుగానూ, అటు ఫీల్డ్ కమాండర్‌గానూ కూడా పనిచేస్తూ, మాస్కోలోని ప్రధాన కార్యాలయానికీ, యుద్ధ రంగానికీ మధ్య తరుచు తిరుగుతూ ఉండేవారు. ఎర్రసైన్యం బలం పెంచడానికి నిర్విరామంగా ఆయన కృషిచేశారు. అసమర్థులైన ఆఫీసర్‌లను ఏరి వేసి, కొత్తగా చేర్చుకున్న సైనికులకు కఠోరమైన క్రమశిక్షణ అలవరిచారు.

1941 అక్టోబరులో జర్మన్‌లు మాస్కోకి 50 మైళ్ళ దూరం దాకా చొచ్చుకొని వచ్చినప్పుడు స్టాలిన్ ఆ జర్మన్ దాడిని ఎదుర్కొనే బాధ్యతను ఝుకోవ్‌కి వప్పగించారు. "ఇంక ఒక్క అడుగు మనం వెనుకకు వేయకూడదు. ఫాసిస్టులను అటకాయించండి! ఒక్కొక్కడు పదిమంది పెట్టుగా పోరాడండి!" అని ఆయన సైనికులను ఉద్బోధించారు. ఎర్రసైన్యం వెనుకంజ వేయడం ఆగిపోయింది.

రిజర్వు సేనలను పిలిపించారు గాని, జర్మన్‌లు ఇందుమించు రష్యన్ రాజధాని

## చంద్రుడి నుంచి కనిపించే చైనా 'గ్రేట్ వాల్'



భూమిమీది మానవ కల్పితమైన నిర్మాణాలలో చంద్రుని మీద నుంచి చూసేవారికి కనిపించే ఒకే ఒక నిర్మాణం చైనా దేశంలోని 'గ్రేట్‌వాల్'. 1700 సం ల కాలంలో అప్పుడప్పుడు నిర్మించబడిన వేర్వేరు గోడల సమాహారమే ఈ 'మహా కుడ్యం' (great wall). ఈ గోడ మొత్తం పొడవు 2,500 మైళ్ళు. పాములాగ మెలికలు తిరిగిన ఈ గోడలో అక్కడక్కడ ద్వారాలూ, బురుజులూ మొత్తం 24,000 దాకా కనిపిస్తాయి. తూర్పున పసుపు సముద్రపు తీరాన ఉన్న షన్‌హై కువాన్ నుంచి పడమట గోబీ ఎడారిలోని చైయుకువాన్ దాకా కొండల మీదుగా, ఎడారుల మీదుగా, మైదానాల మీదుగా ఈ గోడ నిర్మించబడింది.

" 'చావు' అనేది లేదు: నక్షత్రాలు అస్తమించడం
మరో తీరాన ఉదయించడానికే!" —జె.ఎల్. మెక్‌క్రీరీ

మాస్కో నగరం ద్వారాలను సమీపించేదాకా ఝుకోవ్ వారిని రంగంలోకి దింపలేదు. జర్మన్‌లు తాను పన్నిన బోనులో చిక్కుకున్న తరువాత ఒక్కసారిగా ఆయన ఎదురు దాడి ప్రారంభించారు. డిసెంబరు నగపడే సరికి జర్మన్‌ల 50 డివిజనులూ తిరుగు ముఖం పట్టాయి. రష్యన్‌లు పురోగమించ సాగారు.

చరిత్రాత్మకమైన స్టాలిన్‌గ్రాడ్ ముట్టడిలో రష్యన్‌లు విజయం సాధించడానికి ఝుకోవ్ నాయకత్వమే ప్రధాన కారణం! తరువాత ఝుకోవ్‌ని లెనిన్‌గ్రాడ్‌కు ట్రాన్స్‌ఫర్ చేశారు. అక్కడ ఒక పథకం ప్రకారం ఆయన సాగించిన ఎదురు దాడి జర్మన్ ముట్టడిని భగ్నం చేసింది.

ఆఖరు దశలో 200 రష్యన్ డివిజన్‌లకు నాయకత్వం వహించి ఝుకోవ్ నాజీ సైనిక శ్రేణుల నడిమిభాగాన్ని విచ్ఛిన్నం చేశారు. 18 రోజులలో 300 మైళ్ళు పురోగమించి, మొదట వార్సానూ, తరువాత జర్మన్ రాజధాని బెర్లిన్‌నీ పట్టుకున్నారు.

ఝుకోవ్ దృష్టిలో "యుద్ధం ఒక శాస్త్రం. సరియైన క్రమంలో మనుష్యులనూ, ఆయుధాలనూ, సమయాన్నీ, స్థలాన్నీ వినియోగించు కోడం ద్వారా అది గడుగునా విషమ గణిత సమస్యలను పరిష్కరించుకుంటూ పోవాలి." ఆయన ఇలా అన్నారు: "నాకు ఏమి అయినా ఫరవాలేదు. నా ప్రాణం కంటె నా సైనికుల ప్రాణం నాకు ముఖ్యం!....నా సైనికులకు నిద్రనూ, విశ్రాంతినీ చేకూర్చడం కోసం నేను నిద్రకూ, విశ్రాంతికీ, దూరం అవుతాను."

ఝుకోవ్ ఉదారుడు, ఉదాత్తుడు, కలుపుగోలు మనిషి, నిజాయితీపరుడు, విశ్వసనీయుడు. తన సైన్యాల ప్రేమనే కాదు, రష్యన్ ప్రజలందరి ప్రేమాభిమానాలనూ ఆయన చూరగొన్నారు.

1974 లో ఆయన మరణించారు. ●

## మెర్సిడీస్ కారు స్థాపించిన మేటి రికార్డు



సుమారు 50,000 కి.మీ.ల దూరాన్ని గంటకు 247.939 కి.మీ.ల సగటు వేగంతో కేవలం 201 గం.ల, 40 ని.లలో (సుమారు 9 రోజులలో) పూర్తిచేసి ఒక మెర్సిడీస్ 190-E కారు ద.ఇటలీలోని నార్డోలో ఒక క్రొత్త ప్రపంచ రికార్డు స్థాపించింది. 2.3 లీటర్ల, 4 సిలెండర్ల ఇంజన్, 16 వాల్వ్‌ల సిలెండర్ గల ఈ కారు మధ్యలో ఎలాంటి ప్రతిబంధకాలూ లేకుండా ప్రయాణించి, 30 ఏళ్ళ క్రితం బోనెవిల్లె (అమెరికా)లో స్థాపించబడిన గంటకు 180 కి.మీ.ల సగటు వేగాన్ని అధిగమించింది.

"అమరత్వంలో నమ్మకం లేనివాడు
దేశం కోసం ఆత్మార్పణ చెయ్యలేడు!" —సిసిరో

# ఎలెక్ట్రానిక్ వోటింగ్ మెషీ

హైదరాబాద్‌లోని ఎలెక్ట్రానిక్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ (ECIL) వారు నిర్మించిన ఎలెక్ట్రానిక్ వోటింగ్ మెషీన్‌లను ఇటీవల కేరళ, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో జరిగిన కొన్ని అసెంబ్లీ ఎన్నికలలో ప్రయోగాత్మకంగా ఉపయోగించి చూశారు.



'మైక్రో ప్రాసెసర్ టెక్నాలజీ' ఆధారంగా ఈ మెషీన్‌ని తయారు చేయడం జరిగింది. దీనిలో రెండు భాగాలు ఉంటాయి. ఒకటి: కంట్రోల్ యూనిట్. రెండు: బాలెటింగ్ యూనిట్. కంట్రోల్ యూనిట్ ప్రిసైడింగ్ ఆఫీసర్, లేదా సీనియర్ పోలింగ్ ఆఫీసర్ దగ్గిర ఉంటుంది. బాలెటింగ్ యూనిట్ పోలింగ్ బూత్‌లో ఉంటుంది. అక్కడ రహస్యంగా వోటర్ తన వోట్‌ను నమోదు చేయవచ్చును.

బాలెటింగ్ యూనిట్‌లో అభ్యర్థుల పేర్లూ, వారి ఎన్నికల గుర్తులూ ప్రదర్శించబడతాయి. ప్రతి అభ్యర్థి పేరుకూ ఎదురుగా ఒక బటన్, ఒక లైట్ ఉంటాయి. వోటర్ నచ్చిన అభ్యర్థి పేరుకు ఎదురుగా ఉన్న బటన్ నొక్కి తన వోట్ నమోదు చేస్తాడు. వెంటనే ఆ బాలెటింగ్ యూనిట్‌లో లైట్ వెలిగి, వోటర్‌కు తన వోటు నమోదైందని తెలియపరుస్తుంది. అదేసమయంలో కంట్రోల్ యూనిట్‌లో ఒక ధ్వని వివిపించి ప్రిసైడింగ్ ఆఫీసర్‌కూ, ఏజెంట్‌లకూ ఒక వోటు నమోదైనట్టు తెలియజేస్తుంది.

బాలెటింగ్ యూనిట్‌కీ, కంట్రోల్ యూనిట్‌కీ మిక్కిలి సన్నిహితమైన సంబంధం ఉండడంవల్ల వోటర్ ఒకే బటన్ తప్ప ఎక్కువ బటన్‌లు నొక్కే అవకాశం ఉండదు. కంట్రోల్ యూనిట్ ఎప్పటికప్పుడు మొత్తం ఎన్ని వోట్లు నమోదైందీ తెలియజేస్తూ ఉంటుంది. అందుచేత ప్రిసైడింగ్ ఆఫీసర్ ఎన్నిక జరిగిన రోజునే వెంటనే ఎన్నిక ఫలితం ప్రకటించడం సాధ్యం అవుతుంది.

('ఇన్వెస్టిగేషన్స్ ఇంటెలిజెన్స్' సౌజన్యంతో)

---

## ఒక్కొక్క జాతికి ఒక్కొక్క అలవాటు!

వార్తా పత్రికలు చదవడంలో బ్రిటిష్ వారిని మించినవారు లేరు. అమెరికన్‌లకు రేడియో, టెలివిజన్ వ్యామోహం ఎక్కువ. సినిమాలు చూడడంలో రష్యన్‌లది పైచేయి!

"తెలివి తక్కువ వాడికి 'తెలివి' ఎక్కడా కనిపించదు!" —ఏ. షాపెన్ హోవర్

# జాతీయ వార్తలు

## లక్ష ఎకరాలను సాగులోకి తెచ్చే రాజస్థాన్ కాలువ:

బికనీర్‌కి సుమారు 150 కి.మీ. ల దూరంలో ఉన్న చరన్‌వాలి నుంచి ఇటీవల రాజస్థాన్ కాలువ లోకి నీరు విడువడంతో ఎడారి ప్రాంతం అయిన జైసాల్మేర్ జిల్లా చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ఆరంభ మైంది. దారి పొడుగునా ఎన్నో గ్రామాలకు మంచినీరు సరఫరా చేయడమే కాకుండా, ఈ కాలువ శతాబ్దాల తరబడి దప్పికగొని ఉన్న సుమారు లక్ష ఎకరాలకు నీటివసరు కూర్చి, కొత్తగా సాగులోకి తెస్తుంది.

* * *

## యురేనియం నిలువలు:

'ది ఆటమిక్ మినరల్స్ డివిజన్' (AMD) వారు 'కర్ణాటక' లోని 'ఉత్తర కన్నడ' జిల్లా లోనూ, మధ్యప్రదేశ్‌లోని బిలాస్‌పూర్, సుర్‌గుజా జిల్లాలలోనూ, బిహార్ రాష్ట్రంలోని 'పలమా' జిల్లాలోనూ, ఆంధ్రప్రదేశ్‌లోని ప్రకాశం, నెల్లూరు, కర్నూలు, మెహబూబ్ నగర్ జిల్లాలలోనూ, హిమాచల ప్రదేశ్, మేఘాలయాలలో కొన్ని ప్రాంతాలలోనూ 'యురేనియమ్' నిలువలు ఉన్నట్టు గుర్తిం

## పొడుగు ఎదిగేందుకు తోడ్పడే హార్మోన్



సుమారు 1.2 మీటర్లు ఎత్తున్న మరుగుజ్జులను ఇంకా ఎత్తుగా ఎదిగేట్టు చేయవచ్చు నని లితువేనియా (రష్యా) లోని కౌనాస్‌లో ఉన్న 'ది సెంట్రల్ లాబొరేటరీ ఆఫ్ ఎండోక్రిన్ ప్రిపరేషన్ ఫాక్టరీ' డైరెక్టర్ ఐడ్వికాస్ లా సా స్ అంటున్నారు. 'సొమటో ట్రాపిన్' అనబడే పెరుగుదల హార్మోన్ లోపం వల్లనే కొందరు పొడుగు ఎదుగ రనీ, ఇప్పుడు ఆ హార్మోన్‌ను భారీ ఎత్తున ఉత్పత్తి చేస్తున్నారు గనుక ఇక ముందు అలాంటివారు పొడుగు ఎదిగేందుకు సహాయం చేయవచ్చునని ఆయన అన్నారు.

---

"వ్యక్తి జీవితంలో లాగే సమాజం జీవితంలోనూ
నైతిక పతనాలూ, ఆధ్యాత్మిక విప్లవాలూ సంభవిస్తాయి!" —ఆర్. హెచ్. జానీ

చారు. అణుశక్తి కార్యక్రమాలకు ఈ యురేనియమ్ చాలా ముఖ్యం!

* * *

## పైలట్ లేకుండా ఎగిరే విమానం:

ఖరగ్‌పూర్ (ప. బెంగాల్) లోని 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ' కి చెందిన ఇంజనీర్లు పైలట్ లేకుండా ఎగిరే ఒక చిన్న విమానాన్ని తయారుచేశారు. కేవలం 10 కి.గ్రా. లు మాత్రమే బరువుండే ఈ మినీ విమానం భూమికి కేవలం 30 మీ.ల ఎత్తులో శత్రువుల రాడార్‌ల కంట పడకుండా చుట్టూ 5 కి.మీ. ల దూరం దాకా ఎగురగలదు. ఇలాంటి మినీ విమానాలు అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, ప. జర్మనీ, ఇజ్రేల్ లలో వాడుకలో ఉన్నాయి.

* * *

## టెలివిజన్ గ్లాస్ బల్బుల ఫ్యాక్టరీ:

ఇండియాలో మొట్టమొదటి టెలివిజన్ గ్లాస్ బల్బుల ఫాక్టరీని రూ. 40 కోట్ల వ్యయంతో భారత్ ఎలక్ట్రానిక్ లిమిటెడ్‌వారు మహారాష్ట్రలోని 'తలోజా' లో నెలకొల్పుతున్నారు. ఏటా 10 లక్షల నలుపు, తెలుపు గ్లాస్ బల్బులను ఇది ఉత్పత్తి చేయగలదు.

* * *

## ఇండియా నుంచి వజ్రాల ఎగుమతి:

'ది ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనామిక్ స్టడీస్' వారి సర్వే ప్రకారం 1972-73 లో ఇండియా రూ. 100 కోట్లు ఖరీదు చేసే వజ్రాలూ, మణులూ, ఆభరణాలూ మాత్రమే ఎగుమతి చేయగా, 1982-83 లో ఆ ఎగుమతుల విలువ రూ. 1,000 కోట్ల దాకా పెరిగినట్టు తెలుస్తుంది.

(మిగతా 30 వ పేజీలో)

## మహా బలశాలి



ప్రాచీన కాలంలో క్రోటోనా (ద. ఇటలీ) కు చెందిన 'మైలో' మహా బలశాలిగా ప్రసిద్ధి పొందాడు. క్రీ పూ. 540 - క్రీ పూ. 516 మధ్య జరిగిన 6 ఒలింపిక్ పోటీలలోనూ మల్లవిద్యలో ఛాంపియన్‌షిప్‌ను ఆయనే గెలుచుకున్నాడు. పౌసానియాస్, ప్లూటార్క్, స్ట్రాబో అనే చరిత్ర రచయితల కథనం ప్రకారం 'మైలో' చెయ్యి చాపితే ఆయన చేతివేళ్ళను ఎవ్వరూ వంచలేక పోయేవారు. ఒకసారి బాగా బలిసిన ఒక ఆబోతును సునాయాసంగా భుజాలమీద ఎత్తుకుని గ్రీస్‌లోని ఒలింపియా స్టేడియమ్‌లోకి ఆయన నడిచి వచ్చాడట!

---

"ఆవేశాలు చెలరేగినప్పుడు మేధావికి మౌనమే శరణ్యం!" —జోస్ ఓర్టెగా వై గాసెట్

# నమ్మలేని నిజాలు

## వెల్లుల్లి తెచ్చిన విడాకులు!

జేమ్స్ ఫోర్డ్ భార్య పరస్త్రీ లెవ్వరూ తన భర్త పొందు ఆశించకుండా ఉండేందుకని భర్తకు రోజూ భోజనంలో వెల్లుల్లి వడ్డిస్తూం దనే కారణంతో ఓహియో (అమెరికా) రాష్ట్రంలోని ఒక కోర్టు అతనికి ఆమెతో విడాకులు మంజూరు చేసింది.

## అమర్చకుండా టెలిఫోన్ బిల్లు!

జయంత్ అనే అసామీ 'బొంబాయి టెలిఫోన్స్' వారికి టెలిఫోన్ కనెక్షన్ కోసం దరఖాస్తు పెట్టుకున్నాడు. వాళ్ళ ఇంట్లో ఇంతవరకూ టెలిఫోన్ అయితే అమర్చబడలేదు గాని, అతని పేరూ,నంబరూ టెలిఫోన్ డైరెక్టరీలో అచ్చయాయి. అక్కడితో ఆగకుండా, 1982 డిసెంబరు 31 నుంచి 1983 మే 31 దాకా రూ. 853 లకు ఒక బిల్లు కూడా అతనికి అందింది.

* * *

## ఫ్రీజర్ నుంచి ప్రాణంతో బయటపడ్డ కోడిపిల్ల!

లైఫ్-ఆన్-మెండిప్ (ఇంగ్లండ్) లోని మాంసాన్ని ప్రోసెస్ చేసే కర్మాగారంలోని కార్మికులు వచ్చిన కోడి పిల్లలతోపాటు పొరపాటున ఒక బ్రతికి ఉన్న కోడిపిల్లను కూడా గోనె సంచిలో వేసి ఫ్రీజర్‌లో పడే

(మిగతా 33 వ పేజీలో)

## రోజుకు 2 అ.లు ఎదిగే వెదురు



గడ్డిజాతికి చెందిన వెదురు మొక్కలలో కొన్ని రకాలు 100 అ.ల ఎత్తు దాకా కూడా పెరుగుతాయి. మొలాకా వెదురు 24 గం.ల లోనే చిత్రంగా 2 అ.ల ఎత్తు ఎదుగుతుంది.

'అపకారికి ఉపకారం చెయ్యి!
ఉపకారికి ఉపకారం చెయ్యి!" -ఈసప్

## ఎందుకు?

# సబ్బు ఎందుకు శుభ్రపరుస్తుంది?

సబ్బుల తయారీలో ప్రధానంగా ఉపయోగించే వస్తువులు 'కొవ్వు నూనె'లూ, ఏదో ఒక క్షారం (సున్నం లాంటిది). సబ్బులలో ఉన్న ఆ క్షారం వల్లనే మన ముఖాన్ని సబ్బు శుభ్రం



చేయగలుగుతున్న దని ఆదిలో భావించేవారు. కాని సబ్బులలో ఉండే క్షారం చాలా కొద్ది భాగం అనీ, దానివల్ల ముఖం శుభ్రపడడం లేదనీ, సబ్బుతో ముఖం కడుక్కునే ప్రక్రియ భౌతికమైందే గాని, రాసాయనికమైంది కాదనీ ఇప్పుడు గుర్తిస్తున్నారు.

సబ్బునీటిలో ముఖంమీది ధూళికణాలు కరిగిపోవు. సబ్బునీటిలోని బుడగలు ధూళి కణాలను పైన తేలేటు చేస్తాయి. అందుచేత సబ్బుతో ముఖం రుద్దుకుంటే తిరిగి ధూళి కణాలు ముఖంమీద చేరకుండా మాత్రమే అది చేయగలదు. సబ్బునీటిలో ఉన్న ధూళిని వడకట్టడంలో ఉన్న కష్టం ఈ విషయాన్ని మనకు రుజువు చేస్తుంది. సబ్బులో ఉన్న నూనెలు ముఖంమీది ధూళి కణాలతో కలిసి తేలికగా చేతితో తుడిస్తే అవి తొలగిపోయేట్టు చేస్తాయి.

సబ్బుతో ముఖం రుద్దుకునేటప్పుడు శ్రద్ధ అవసరం. మరీ ఎక్కువగా గాని, మరీ తక్కువగా గాని సబ్బును ముఖానికి పట్టించడంవల్ల ప్రయోజనం ఉండదు. అదనపు ప్రక్షాళన శక్తికోసం కొన్ని సబ్బులలో రాసాయనిక పదార్థాలు చేరుస్తున్నారు. కాని అవి అంత ప్రశస్తం కాదు.

---

## ఇసుక తక్కెడ - పేడ తక్కెడ

రొట్టెల వాడు: (జడ్జితో) అయ్యా! ఈ అసామీ నాకు 1,000 గ్రాముల నెయ్యి అని ఇచ్చాడు. తీరా ఇంటికి వెళ్ళి తూస్తే అది 700 గ్రాములే ఉంది.

జడ్జి: (నేతికొట్టు వానితో) ఏదీ నీ తక్కెడ రాళ్ళు చూపించు!

నేతికొట్టు వాడు: అయ్యా! నా దగ్గిర తూకం రాళ్ళు లేవు. రొట్టెల కొట్టువాడు 1,000 గ్రాముల రొట్టె అని ఇచ్చాడు. ఆ రొట్టెతోనే నేను అతనికి నెయ్యి తూచాను.

జి. వి. రమణ, నిజామాబాద్.

"హక్కులలో, అధికారాలలో అసమానత్వం ఈ ప్రకృతిని సృష్టించిన జగత్పితతోనే మొదలు!" —లియో XIII

# కార్టూనుల గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 33

## రచన - 3

ప్రకృతిలో కొన్ని వస్తువులు 'సరూపం' (Symmetrical) గానూ, మరి కొన్ని

Symmetry

Symmetry Asymmetry

Asymmetry

'వి రూ ప ం' (Asymmetrical) గానూ ఉండడం మనకు తెలిసిందే! కేంద్ర బిందువు నుండి రెండు పార్శ్వాలూ సమానంగా ఉంటే దానిని 'సరూపం' అనీ, అలా లేక పోతే 'విరూపం' అనీ అంటాము. ఒక నిమ్మచెట్టు రెమ్మను గాని, ఎదురుగా ఉన్న మనిషి ముఖం దృశ్యాన్ని గాని తీసుకోండి. ఇవి 'సరూపాలు'. ప్రక్కకు తిరిగి ఉన్న మనిషి ముఖం గాని, కొన్ని కొన్ని చెట్ల రెమ్మలు గాని 'విరూపాలు'గా కనిపిస్తాయి. అంటే—వేర్వేరు భాగాల మధ్య నిష్పత్తే, లేదా రెండు పార్శ్వాల మధ్య కనిపించే సారూప్యమే 'సరూపత్వం' అన్నమాట!

అలంకారార్థం గీసే డిజైన్‌లలోనూ, మరి కొన్ని రకాల చిత్రాలలోనూ, 'స రూ ప



Symmetry



Asymmetry

### ప్రపంచంలో నిరుద్యోగులు

ఏ సమయంలో చూసినా ప్రపంచంలో మొత్తం నిరుద్యోగుల సంఖ్య దాదాపు 7½ కోట్లు ఉంటుంది. వర్ధమాన దేశాలలోనే 1987 నాటికి నిరుద్యోగుల సంఖ్య 60 కోట్లు ఉండగల దని భావిస్తున్నారు.

---

"ఏదో నిర్ణయం తీసుకోకుండా, అన్ని రకాల ఆలోచనలనూ మనస్సులోకి రానీయడం 'తెలివి' ని పెంచుకునే మార్గం!" —కీట్స్





త్వాన్ని' మనం ప్రదర్శించాలి. అం కార్టూన్‌లలో 'విరూపత్వాన్ని' ప్రదర్శించ డమే మంచిది. విరూపత్వాన్ని సాధించడం కోసం రెండు భాగాలలో ఒకదానిలో పెద్ద బొమ్మనూ, మరోదానిలో చిన్న బొమ్మనూ గీయాలి. ప్రకృతి దృశ్యాలను చిత్రించే సందర్భాలలో విరూపత్వాన్ని సాధించడానికి దూర భూరేఖ (horizon) ను చట్రం (panel) మధ్య బిందువు నుంచి కొంచెం పైగా గాని, దిగువగా గాని గీసుకోవాలి!

(సశేషం)

## బాల కార్మికుల కడగండ్లు

ప్రపంచంలో బాల కార్మికులు ఎక్కువగా ఉన్నది తమిళనాడులోనే అనే జూరిస్ట్‌ల అంతర్జాతీయ సంఘం ప్రకటించింది. రామ నాథపురం జిల్లాలోని అగ్గిపెట్టెల ఫాక్టరీలలో పని చెయ్యడానికి 30 కి.మీ.ల దూరం నుంచి కూడా బస్సులలోనూ, లారీలలోనూ పిల్ల లను తీసుకువస్తారు. తెల్లవారుజామున గం. 3 ల నుంచి గం. 5 ల లోపు వారు ఇల్లు వదిలితే మళ్ళీ సాయంత్రం గం. 6 ల నుంచి గం. 9 ల మధ్య తిరిగి ఇల్లు చేరుకుంటారు. 4 మొదలు 10 ఏళ్ళ పిల్లలకు రోజుకి రూ. 2 లు, పెద్ద పిల్లల కయితే రూ. 6 లు, లేదా రూ. 7 లు కూలీ ఇస్తారు.

(26 వ పేజీ తరువాయి)

## క్రొత్త వన్యమృగ సంరక్షణ కేంద్రం:

మహారాష్ట్రలోని కొయినా డామ్‌కు 'జల సమర్పణ ప్రాంతం' (catchment area) లో 227 చ.కి.మీ. ల అడవిలో త్వరలోనే ఒక నూతన వన్య మృగ సంరక్షణ కేంద్రం నెలకొల్పబోతున్నారు. దట్టమైన ఈ అడవు లలో మిక్కిలి అరుదైన వృక్ష, జంతు జాతు లెన్నో ఉన్నాయి.

* * *

## ప్రాచీన గుహా చిత్రాలు:

క్రీ.పూ. 1,000 మొదలు 500 సం. రాల కాలానికి చెందిన ప్రాచీన గుహా చిత్రాలను ఇటీవల దిండిగల్ (తమిళనాడు) లోని సిరు మలై కొండలలో కనుగొన్నారు. తెలుపు, జేగురు రంగులలో ఉన్న ఈ చిత్రాలు వివిధ మానవ కార్య కలాపాలను నిరూపిస్తూ, ప్రాచీన తమిళుల జీవన విధానాలను గుర్తించ డానికి తోడ్పడుతున్నాయి.

"కల్లా, కపటం ఎరుగనివాడు ఎవ్వరినీ శంకించడు!" —బెన్ జాన్సన్

# క్యూబ్ పజిల్ వ్యామోహం






కొద్ది సంవత్సరాల క్రితం కూడా ఇండియాలో పజిల్ క్యూబ్ కావాలంటే దొరికేది కాదు. ఇప్పుడు ఏ పెద్ద షాప్‌లో అడిగినా దొరుకుతూంది. అరచేతిలో ఆ క్యూబ్ పెట్టుకొని రకరకాలుగా దానిని తిప్పుతూ, వినోదించే వారు ఈ నాడు ఎందరో మనకు కనిపిస్తున్నారు. ఈ 20వ శతాబ్దం తాలూకు మిక్కిలి చిక్కుప్రశ్న అయిన ఈ క్యూబ్ పజిల్‌ని సాల్వ్ చేస్తూ పొందే ఉత్తేజం, విజయం సాధిస్తే కలిగే తృప్తీ సాటిలేనివి!

ఈ 'రూబిక్ క్యూబ్' ఒక ఆటవస్తువు. 6 రంగులతో కూడిన 27 చిన్న చిన్న 'క్యూబ్' (ఘనము)లు కలిపి ఏర్పడ్డ ఒక పెద్ద క్యూబ్ ఇది. చిన్న క్యూబ్‌లను రకరకాలుగా త్రిప్పి ఒక ప్రక్క అన్నీ ఒకే రంగు క్యూబ్‌లు వచ్చేట్టు చెయ్యాలి. క్రొత్తలో ఈ పజిల్ సాధించడానికి చాలా టైమ్ పడుతుంది. ఒకసారి ఆ ఒడుపు తెలిసే తరువాత క్రమంగా తక్కువ తక్కువ కాలంలో ఈ పజిల్‌ను సాధించవచ్చు. మొత్తం 4,300 కోట్ల రకాలుగా ఈ క్యూబ్‌ను అమర్చేందుకు అవకాశాలు ఉన్నాయి. చాలా మంది దీనినిచూపి మొదట బేజారయిపోతారు.

ఈ 'రూబిక్ క్యూబ్' ని ఆదిలో 'బువోస్ కోచా' (అంటే మాజిక్ క్యూబ్) అనేవారు. హంగరీలోని బుడాపెస్ట్‌లో ది కాలేజ్ ఆఫ్

## రైలు పెట్టెల నిర్మా కొత్త రకం ఉక్కు

సోవియెట్ రష్యాలోని శాస్త్రవేత్తలు రైలు పెట్టెల నిర్మాణానికి ఉపయోగించే కొత్త రకం ఉక్కును కనిపెట్టారు. ప్రస్తుతం వాడుతున్న ఉక్కు రకాల కంటె దీని 'అరుగుదల నిరోధకశక్తి' (corrosion resistance) దాదాపు రెండింతలు!

"రచయితకు తనని గురించి తను చెప్పేటప్పుడు కలిగే ఉత్తేజం మరొకప్పుడు కలుగదు!" —అనటోల్ ఫ్రాన్స్

అప్లైడ్ ఆర్ట్స్'లో ఆర్కిటెక్చర్ ప్రొఫెసర్ ఎర్నో రూబిక్ ఈ 'క్యూబ్'ని మొదట తయారు చేశారు. అయితే-అదే కాలంలో స్వతంత్రంగానే జపాన్‌లోని 'తెరుటోషి ఇషిగె' అనే మరో ఇంజనీర్ కూడా దీన్ని కనిపెట్టారు.

మూడు పరిమాణాలు గల వస్తువుల మధ్య ఉండే ప్రాదేశిక సంబంధాలను గుర్తించడానికి తన విద్యార్థులకు తోడ్పడే సాధనంగా ప్రొ॥



రూబిక్ దీనిని డిజైన్ చేశారు. 1974 లో ఆయనకు ఈ ఊహ రావడం, 1975 లో దీని ఉత్పత్తికి ఆయన లైసెన్స్ తీసుకోడం జరిగింది. తొలిసారిగా 1977 లో హంగరీలోనే భారీ ఎత్తున ఈ క్యూబ్‌లను ఉత్పత్తి చేసి అమ్మకానికి పెట్టారు. 1979 లో ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ, ఆస్ట్రేలియా, జపాన్ మార్కెట్‌లలోకి కూడా ఇవి ప్రవేశించాయి. ప్రస్తుతం ఈ క్యూబ్‌లు అమ్మని దేశం లేదు.

ఒక్క హంగరీలోనే 1977 నుంచి ఇప్పటికి 20 లక్షల క్యూబ్‌లు ఖర్చయ్యాయి. హంగరీ జనాభా ఒక కోటి. అంటే ఆ దేశంలో ప్రతి 5 గురిలో ఒకరి దగ్గిర ఈ క్యూబ్ ఉందన్న మాట! ఇటీవలి కాలంలో ఈ 'క్యూబ్'కి అంతర్జాతీయంగా జనాదరణ లభించింది. ప్రపంచం మొత్తం మీద ఇప్పటికి 3 కోట్ల క్యూబ్‌లు అమ్ముడు పోయాయి. ఈ క్యూబ్ మీద రాయల్టీ రూపంలో ప్రొ॥ రూబిక్‌కి పన్నులు పోను నెలకు 30,000 డాలర్లు (రూ. 2.85 లక్షలు) ఆదాయం వస్తూంది.

ఈ పజిల్ సాల్వ్ చేసే సూచనలకు కూడా గిరాకీ పెరిగింది. వేర్వేరు భాషలలో 60 పైచిలుకు పుస్తకాలు ఈ విషయమై వెలువడ్డాయి. రికార్డు స్థాయిలో వాటి కాపీలు చెల్లుతున్నాయి. లండన్‌లోని పాట్రిక్ బాసెర్ట్ తన 13 వ ఏట వ్రాసిన పుస్తకం అన్నిటి కంటె ఎక్కువగా ఖర్చవుతూంది. ఈ పజిల్‌ని కేవలం 53 సెకనులలోనే ఆయన

## లెనిన్ గ్రాడ్ ప్రత్యేకత

రష్యాలోని మిక్కిలి పెద్ద నగరాలలో రెండోది అయిన లెనిన్ గ్రాడ్ జనాభా 47 లక్షలు. విస్తీర్ణం 606 చ.కి.మీ.లు.

రెండో ప్రపంచ సంగ్రామంలో ఆ నగరం మీద 1,07.000 బాంబులు ప్రయోగించబడి, 16,147 మంది హతులయారు. ఆ నగరం ముట్టడి సమయంలో తిండి కరువై మరో 6,32,253 మంది చనిపోయారు. ఇక్కడ 41 ఉన్నత విద్యాసంస్థలు, 47 మ్యూజియమ్‌లు, 2,500 లైబ్రరీలు, 40 స్టేడియమ్‌లు, 1,000 జిమ్నాషియమ్‌లు ఉన్నాయి.

"అన్యాయానికి గురికావడం కంటె అన్యాయం చెయ్యడం మరింత అవమానకరం!" —సోక్రటీస్ అని కాక: —సెటో

సాల్వ్ చెయ్యగలడు. 'మీరూ క్యూబ్ పజిల్ సాధించవచ్చు!' అనే మరో 112 పేజీల పుస్తకం కూడా ఆయన వ్రాశాడు అచ్చయిన మూడు వారాల లోపుగానే అది 5 లక్షల కాపీలు ఖర్చయింది.



సిడ్నీ (ఆస్ట్రేలియా) యూనివర్సిటీ నుంచి శుద్ధ గణితం (pure mathematics) లో ఆనర్స్ డిగ్రీ పొందిన విలోనె రైలాండ్స్ 1980 డిసెంబరులో జరిగిన ఒక రూబిక్ క్యూబ్ ఛాంపియన్‌షిప్ పోటీలో గెలుపొంది మొట్టమొదటి ఛాంపియన్ అయాడు. 60 సెకన్లకంటె తక్కువ కాలంలోనే ఆయన ఈ పజిల్‌ను సాధించాడు.

మొదటి ప్రపంచ రూబిక్ క్యూబ్ ఛాంపియన్‌షిప్ పోటీ ఇటీవల హంగరీలోని బుడాపెస్ట్‌లో జరిగింది. మిన్‌తాయ్ అనే 16 ఏళ్ళ అమెరికన్ పౌరుడైన వియెత్‌నామ్ జాతీయుడు 22.9 సెకనులలో ఈ పజిల్‌ను సాధించి ఆ ఛాంపియన్‌షిప్ గెలుచుకున్నాడు. 19 వేర్వేరు దేశాలనుంచి వచ్చిన పోటీదారులు ఆ పోటీలో పాల్గొన్నారు.

ప్రొ॥ రూబిక్ ఈ పజిల్‌ను సాధించడానికి ఒక నిముషం పట్టేది! 'దీనిని సాధించడానికి బుద్ధిబలం కూడా అవసరం!' అంటారు ఆయన. చిత్రం ఏమిటంటే—ఈ పజిల్‌ని పెద్దవాళ్ళకంటె చిన్నపిల్లలు మరింత శీఘ్రంగా సాధించగలరు.

---

(27 వ పేజీ తరువాయి)

శారు. రెండు వారాల తరువాత ఆ సంచీ తీసి చూస్తే చిత్రంగా ఆ కోడిపిల్ల బ్రదికి ఉంది. ఐరిస్ మాకులాఫ్ అనే 'కుక్కుట ప్రియుడు' (chicken fancier) దాని కాళ్ళను మర్దన చేసి దానిని మామూలు స్థితికి తెచ్చాడు. బహుశః సంచీలో మధ్యభాగంలో ఉండడంవల్ల తక్కిన కోడిపిల్లల రెక్కలు దానికి కొంత వెచ్చదనాన్ని కలిగించి ఉండడం వల్ల అది ప్రాణాలతో బయటపడి ఉండవచ్చునంటున్నారు.

* * *

## పేదల కుద్దేశించిన 'అప్పును' అందుకున్న లక్షాధికారి!

సాంచి డెవలప్‌మెంట్ బ్లాక్ (మధ్య ప్రదేశ్) లోని కట్నారీ గ్రామం మాజీ సర్పంచ్ గజ్‌రాజ్‌సింగ్ 55 ఎకరాల పొలం అనేక ఇళ్ళూ ఉన్న ఒక లక్షాధికారి! అయినా దారిద్ర్య రేఖకు దిగువను జీవించే అభాగ్యుల కోసం ఉద్దేశించబడిన 'అప్పు' ఒక బావి తవ్వడం కోసం అతనికి మంజూరైంది. రాయ్‌సెన్ కలెక్టర్‌కి వెంటనే ఆ 'అప్పు'ను వసూలు చేయమని తాఖీదులు పంపారు.

"పరులు చేసిన అపకారం మరచిపోవచ్చు;
మనం చేసిన అపకారం చస్తే మరపురాదు!" —ఖలీల్ జిబ్రాన్

# బహుమతి పొందిన వ్యాసం

# సైన్సు - మతం

వి.పి. నరసింహారెడ్డి, గుంటూరు.

సైన్సు ఎంత అభివృద్ధి చెందినా మతంలో మానవుని విశ్వాసం రవ్వంత కూడా తగ్గ లేదు. నిజానికి ఈ రెంటికీ ఎలాంటి వైరుధ్యమూ లేదు. రెండూ పరస్పర పూరకాలు. సైన్సు లేకపోతే మానవునికి పురోగతి లేదు. మతం లేకపోతే మనిషికి శాంతి లేదు.

మొట్టమొదటి సారిగా చంద్రమండలం మీద అడుగుపెట్టిన అమెరికన్ వ్యోమగామి ఆర్మ్‌స్ట్రాంగ్ భగవంతుని దయవల్ల క్షేమంగా తను చంద్రమండలంపై దిగినట్లు భూమికి సందేశం పంపించాడు. చంద్రమండలం యాత్ర విజయవంతం కావా లనీ, వ్యోమ గాములు క్షేమంగా భువికి తిరిగి రావా లనీ అమెరికన్ ప్రజలు దైవ ప్రార్థనలు జరిపారు. మతంలో మానవుని విశ్వాసం ఫలించింది. చంద్రమండల జైత్రయాత్ర ముగించుకుని వ్యోమగాములు క్షేమంగా భూమికి తిరిగి వచ్చారు. సాంకేతికంగా ఎంతో ప్రగతి సాధించిన జపానీయులు బౌద్ధారామాలలో నిత్యం విధిగా ప్రార్థనలు చేస్తారు.

సైన్సు అభివృద్ధి వల్ల మానవుడు భౌతి

## టైపింగ్‌లో నేషనల్ ఛాంపియన్



1983 వ సం.రం మిక్కిలి వేగంగా టైప్ చేసిన వారి కిచ్చే 'నేషనల్ ఛాంపియన్ షిప్' ట్రాఫీని సిమ్లా (హిమాచల ప్రదేశ్)కు చెందిన 41 ఏళ్ళ వయస్సు గల డా॥ రాజేంద్ర సింగ్ అనే దంతవైద్యుడు గెలుచుకున్నాడు. మద్రాసులో ఏర్పాటైన ఆ పోటీలో నిముషానికి 88 మాటల చొప్పున 15 ని.లలో కొట్టడానికి వీలైన పాసేజ్ ఇవ్వగా, నిముషానికి 101 మాటలు ఆయన టైప్ చేశారు.

"ద్రవ్యోల్బణం ట్రాఫిక్ సమ్మర్దం మధ్య చిక్కుబడడం లాంటిది!" -జె. కె. కె.

కంగా ఎన్నో సౌకర్యాలు సాధించి విలాస భరితమైన, సుఖమయమైన జీవితం గడుపు తున్నాడు. అయినా, సైన్సులో అపారమైన అభివృద్ధి సాధించిన పాశ్చాత్యులు మనశ్శాంతి కరువై అలజడితో అటమటిస్తున్నారు. చాలా ఆత్మహత్యలకు కారణాలు ఆర్థిక పరమైనవి కావు. మతాన్ని గురించిన సరియైన అవగాహన లోపించడమే అందుకు కారణం. కేవలం సైన్సు సుఖాన్ని ఇవ్వలేదు. మతం లేని నాడు మనిషి పశుతుల్యుడే!

* * *

ఎస్. సుధారాణి, గుంటూరు.

"మతం సాయం లేని సైన్సు కుంటిది. సైన్సు కళ్ళులేని మతం గ్రుడ్డిది"—అని నిర్ద్వంద్వంగా చెప్పిన మహానుభావుడు ఐన్ స్టైన్. సైన్సు, మతం—రెండూ ఒకదానితో ఒకటి పెనవేసుకుని ఉన్న వని ఈ మాటలవల్ల తెలుస్తుంది. ఏదో అద్భుతశక్తి ఈ విశ్వాన్ని నడుపుతూం దనీ,అదే దేవు డనీఅనాదిగా మానవుడు విశ్వసించాడు. కాని సైన్సు తత్త్వాన్ని సక్రమంగా గ్రహించలేని కొందరు ఆధునికులు భౌతికవాదులుగానూ, హేతువాదులుగానూ రూపొంది, దేవుడు లేడు అని వాదించే నాస్తికులు అయారు. ఇందుకు ఒక కారణం- మానవునిలోని దేవుని మీది విశ్వాసం వక్ర మార్గంలో పయనించి అస్పృశ్యత, మూఢ విశ్వాసాలు మొదలైన వాటిని రూపొందించడం!

నేడు విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందింది. కాని ఆ విజ్ఞానం వక్రమార్గం పట్టడంవల్ల పరమాణు యుద్ధం సంభవించి ప్రపంచవే నాశనం కాగల ప్రమాదం ఏర్పడింది ఇలాంటి ప్రమాదాలను నివారించ కలిగేది మతం ఒక్కటే! అన్ని మతాలూ అహింసను బోధిస్తున్నాయి. అందుచేత మతంలో నమ్మకం గలవారే సైన్సు పేరిట జరిగే మారణ కాండను నివారించ గలరు.

*

## భవిష్యత్తులో వాడే చిన్న కారు



బహుశః భవిష్యత్తులో వాడుకలోకి రాబోయే చిన్న కారు 'రుపెల్‌ప్రైమ్' (ప. జర్మనీ) లోని 'ఓపెల్ వర్క్స్' వారు తయారుచేసిన 'ఓపెల్ జూనియర్' కారును పోలి ఉంటుంది. 3.41 మీటర్లు మాత్రమే పొడవు గల ఈ కారులోని 55 అశ్వాలశక్తి గల ఇంజన్ గంటకు 150 కి.మీ.ల వేగంతో ఇది పయనించడానికి తోడ్పడుతుంది. లీటర్ల పెట్రోలుతో గంటకు 90 కి.మీ వేగంతో 100 కి.మీ.ల దూరం ఇది వె గలదు.

"దుష్పరిపాలన ప్రబలిన రాజ్యానికి అండలు: ద్రవ్యోల్బణం, యుద్ధం!" —ఇ. హెమింగ్వే

పి. ఆదిలక్ష్మి, గుంటూరు.

సైన్సు మానవుని మేధాశక్తిని వృద్ధిచేసి అతని సుఖ సంతోషాలను పెంచడానికి కారణం కాగా, మతం ఆధ్యాత్మిక వికాసాన్ని కలిగించి మనశ్శాంతిని ప్రసాదించగలదు.

'ఆగస్టీన్' అనే ప్రముఖ శాస్త్రవేత్తకు చర్చి ఎంతపవిత్రమైనదో, తన పరిశోధనశాల కూడా అంత పవిత్రమైనది. అతని దృష్టిలో ప్రకృతిలోని వివిధ పదార్థాల మధ్య సంబంధాలను గుర్తించడం భగవంతుని ఆశయాలను పునశ్చరణ చెయ్యడమే!

మతం మానవత్వాన్ని చంపి వేసేటంత మౌఢ్యంతో గడ్డకట్టిపోకూడదు. మత సంప్రదాయాలను పూర్తిగా వదలినా సంఘం నశిస్తుంది; అతిగా పాటించినా సంఘం నశిస్తుంది. స్వామీ రామతీర్థ, శ్రీ రామకృష్ణ పరమహంస వంటి మహనీయులు మతానికి ఇచ్చిన నిర్వచనం - మంచితనం, సత్‌శీలం అని. మానవుడు ఎంత విద్వాంసుడైనా, ఐశ్వర్యవంతుడైనా మతం బోధించే మంచితనం, శీలం లోపిస్తే అతనిలో అసురగుణాలు వృద్ధిపొంది, అతడు సమాజానికి కంటకుడుగా తయారవుతాడు.

ఆధునిక విజ్ఞానశాస్త్రం, మతం సరియైన పద్ధతిలో సమన్వయం పొంది, వ్యక్తి అభ్యుదయాన్నీ, తద్వారా దేశం అభ్యుదయాన్నీ సాధించాలి!

## ఎగిరే 'టాంక్!'

'ఎగిరే టాంక్' అనబడే టాంక్ విధ్వంసక, విమాన విధ్వంసక శతఘ్నులతో కూడిన కొత్త రకం హెలికాప్టర్ అనతి కాలంలోనే రష్యన్‌ల ప్రధానాయుధం కాబోతూంది. 18 మీ.ల పొడవు, 4 మీ.ల ఎత్తు ఉండే ఈ హెలికాప్టర్ టాంక్ కంటె 5 మొదలు 10 రెట్లు అధిక వేగంగా పోగలదు; భూమికి చేరువగా ఎగురుతూ 'రాడార్' పరిధి నుంచి తప్పించుకోగలదు.

## దారుణమైన వ్యాధి




ఇవాళ ప్రపంచంలో కనిపించే మిక్కిలి దారుణమైన వ్యాధి కుష్ఠు కాదు, క్షయ కాదు, "నాకు ఎవ్వరూ లేరే! నాకు ఏ అండా లేదే!" అనే నిస్పృహ, దిగులు! మానవులలో ప్రేమ, ఔదార్యం కరువు కావడం, సంఘంలో దోపిడీకీ, అవినీతికీ గురి అయి, దారిద్ర్యంతో, దారుణ వ్యాధులతో అలమటిస్తూ రోడ్డు ప్రక్కన కనిపించే సాటి మానవులపట్ల ఉదాసీనంగా ప్రవర్తించడం—ఇంత కంటె దారుణమైన నేరం మరొకటి ఉండదు!" —మదర్ తెరీసా

"అసమానత్వం లేకుండా ప్రపంచంలో ఏ రాజ్యం ఉండదు; కొందరు స్వతంత్రులూ, కొందరు బానిసలూ!" —ఎమ్. లూథర్

# గిన్నెస్ ప్రపంచ రికార్డుల గ్రంథం కథ

రాఘవేంద్ర రావు

మీకు చిత్రంగా కనిపించవచ్చు గాని, నిజానికి 'గిన్నెస్ ప్రపంచరికార్డుల గ్రంథం'- అదే ఒక ప్రపంచ రికార్డు స్థాపించింది. ప్రపంచంలో మొత్తం 23 భాషలలో వెలువడుతున్న ఈ గ్రంథం ప్రతులు 1982 లో 4.8 కోట్లు అమ్ముడు పోయాయి. ప్రపంచంలోని ఏ ఇతర గ్రంథం ఇన్ని కాపీలు అమ్మలేదు.



ప్రపంచంలో అందరి కంటె 'బీర్' ఎక్కువ ఎగుమతి చేసే డబ్లిన్ (ఐర్లండ్)లోని 'గిన్నెస్ బ్రూయెరీ' మేనేజింగ్ డైరక్టర్ సర్ హ్యూ బీవర్‌తో ఈ కథ అసలు ప్రారంభం అయింది. సుమారు 30 ఏళ్ళ క్రితం ఒక రోజునఒక పానశాల (pub) లో కూచుని మిత్రులతో కలిపి ఖులాసాగా ఏదో పానీయం 'సిప్' చేస్తున్నాడు సర్ హ్యూ. ఉన్నట్టుండి ఆయనకో సందేహం వచ్చింది - 'ప్రపంచంలో మిక్కిలి వేగంగా ఎగిరే పక్షి ఏది?' అని. ఎవ్వరూ అతని సందేహం తీర్చలేక పోయారు. చివరికి పేరెన్నిక గన్న విజ్ఞాన సర్వస్వాలలో కూడా వేట పక్షుల గమన వేగాలను నమోదు చేయలేదు.

"లండన్ తిరిగి వచ్చాక సర్ హ్యూకి మెరుపులాంటి ఒక ఆలోచన వచ్చింది: మిక్కిలి పెద్దదీ, మిక్కిలి పొడుగైందీ, మిక్కిలి బరువైందీ, మిక్కిలి చల్లనిదీ, మిక్కిలి వేడిగా ఉన్నదీ-ఇలాంటి వాటన్నిటి భోగట్టా సేకరించి ఎవరైనా ఒక పుస్తకం అచ్చువేస్తే, ఇంక ఆ విషయంలో వాదోపవాదాలకు ఆస్కారం ఉండక పోవడం సంగతి అలా ఉండగా, వేడి వేడి పకోడీల్లాగ ఆ పుస్తకం ప్రతులు చెల్లి

## జీతంగా 'ఉప్పు'

పూర్వ కాలంలో సైనికులకు జీతంగా 'ఉప్పు' కొలిచేవారు. 'వారి ఉప్పుతిని బ్రతుకుతున్నాం' అనే వాడుక ఆ నాడు వచ్చిందే! రోమ్‌లో కూడా సైనికుల జీతంలో కొంత భాగంగా 'ఉప్పు' కొలిచే ఆచారం ఉండేది. లాటిన్ భాషలో ఉప్పును 'శాల్' (ఇంగ్లీషులో సాల్ట్) అంటారు. కొన్నాళ్ళకు ఉప్పుకి బదులుగా డబ్బు ఇస్తూ దాన్ని 'శాలేరియమ్' (ఉప్పు డబ్బు) అంటూ వచ్చారు. ఆ 'శాలేరియమ్' నుంచే ఈ నాటి ఇంగ్లీషు మాట 'శాలరీ' (జీతం) వచ్చింది.

---

"నీ ఆలోచనను నువు అనుసరించు:
జనం అనే మాటలు పట్టించుకోకు!" —కార్ల్ మార్క్స్

తాయి! ఆయన ఆ ఆలోచన ఎంత సరి అయిందో అనంతర సంఘటనలు రుజువు చేశాయి. అయితే — 'అంత కష్టమైన ఆ పనిని నెత్తిని వేసుకుని ఆ గ్రంథాన్ని తయారు చెయ్యడానికి తగిన వ్యక్తిని లేదా వ్యక్తుల్ని పట్టుకోడం ఎలా?' అనే సమస్య ఆయనకు ఎదురైంది.

సర్ హూఫ్ అదృష్ట జాతకుడు. తమ బ్రూయెరీలోని జూనియర్ ఎగ్జిక్యూటివ్ క్రిస్టఫర్ చాటలేకి సరిగ్గా ఆ పనికి సరిపోయే వ్యక్తులు సమయానికి గుర్తువచ్చారు. క్రీడల రిపోర్టర్లు—రాస్, నారిస్ మెక్ విర్టర్‌లు అనే ఇద్దరు కవల పిల్లలు—ఆయనకు తెలిసిన వారు ఉన్నారు. ఆ పనికి వాళ్ళు అన్ని విధాలా తగినవారు. ఒక ప్రముఖ పత్రికాధిపతి పుత్రులైన రాస్, నారిస్‌లు ఎటు చూపినా పత్రికలూ సమాలోచన గ్రంథాలూ కనిపించే పరిసరాలలో పుట్టి పెరిగారు. చిన్నప్పటి నుంచే ఆసక్తికరమైన వార్తల కటింగ్‌లు భద్రపరుస్తూ ప్రపంచంలోని వివిధ విషయాలను గూర్చిన భోగట్టా సేకరించడం వారికి ఒక బలమైన హాబీ అయింది.

1925 లో లండన్‌లో జన్మించారు రాస్, నారిస్ మెక్ విర్టర్‌లు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదివి, అర్థ, న్యాయ శాస్త్రాలలో ఇద్దరూ ఎం.ఏ. పట్టం పొందారు. ఇద్దరూ కలిసే రాయల్ నౌకాదళంలో కొంత కాలం పనిచేశారు. అనంతరం కొంతకాలం బి.బి.సి. లో టీ.వీ., రేడియో వ్యాఖ్యాతలుగా ఉన్నారు. 7 ఏళ్ళ పాటు 'అబ్జర్వర్' పత్రిక ఆదివారం అనుబంధంలో జాయింట్‌గా ఒక శీర్షిక వ్రాసేవారు.

అమాయికంగా చిన్నతనంలో అలవరచుకున్న 'భోగట్టా సేకరించడం' అనే వాళ్ళ హాబీ 1951 లో ఆ కవల సోదరులకు ధనార్జన సాధనంగా ఉపయోగ పడింది. వార్తాపత్రిక

## కుస్తీలో ప్రపంచ వస్తాదు గామా !



పాటియాలా (పంజాబ్) కు చెందిన 5 అ.ల 7 అం.ల ఎత్తూ, 260 పౌన్ల బరువూ గల మల్లవిద్యా ప్రవీణుడు గామా 50 ఏళ్ళు దాటిన తరువాత కూడా ప్రపంచ వస్తాదుగా తన కీర్తిని నిలుపుకున్నాడు. ప్రపంచ వస్తాదుగా ఉన్న కాలంలో ఆయనతో తలపడడానికి ముందుకు వచ్చినవారు ఇద్దరే ఇద్దరు. ఒకరు: బి. ఎఫ్. రోలర్ అనే అమెరికన్. మరొకరు: స్టానిస్‌లాస్ జ్బిస్కో అనే పోలండ్ దేశీయుడు. ఇద్దరూ కందాలో అడుగుపెట్టిన అరనిముషానికే గామా చేతిలో చి తయారు

"మిక్కిలి ఒంటరిగా నిలబడిన వాడే
ఈ లోకంలో మిక్కిలి బలవంతుడు!" —హెచ్. ఇబ్సెన్

లకూ, ఇయర్ బుక్స్‌కీ, విజ్ఞాన సర్వస్వాలకూ, ప్రచురణకర్తలకూ భోగట్టాను అందజేసే ఏజెన్సీ ఒకటి వారు ప్రారంభించారు. సరిగ్గా ఆ సమయంలోనే క్రిస్టఫర్ చాటలే ఆ సోదరులను సర్ హ్యూ బీవర్‌కి రికమెండ్ చెయ్యడం జరిగింది. గిన్నెస్ డైరెక్టర్లకు ఆ పనికి అంతకంటె మంచివారు దొరకడం కల్ల! సంతోషంగా ఆ పని చేసేందుకు ఆ సోదరులు అంగీకరించారు.

ఇక-గిన్నెస్ గ్రంథం ప్రచురణకు సంబంధించిన కథకు ప్రారంభం 1954. మొదట 198 పుటలతో, ఆకుపచ్చ అట్టతో ఒక చిన్న గ్రంథంగా ఆ ఏడాది అది వెలువడింది. 4 నెలల కాలంలోనే ఫిక్షన్ కాని రచనలలో అది 'బెస్ట్ సెల్లర్' అయింది. ఆ ఏటి కాఏడు ఆ గ్రంథం సైజు క్రమంగా పెరుగుతూ వచ్చి, 1983 నాటి ముద్రణలో అది 758 పుటల గ్రంథం అయింది

దురదృష్టవశాత్తు 1975 లో ఆ సోదరులలో ఒకడైన రాస్‌ని వారి ఇంటిముందే దుండగులు కాల్చి వధించిన విషాద సంఘటనవల్ల ఈ గ్రంథానికి ఆ సోదరుల సంయుక్త సంపాదకత్వం అంతమైంది. లండన్‌ను చిందర వందర చేస్తున్న ఐరిష్ రిపబ్లికన్ ఉగ్రవాదుల విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం తగినంతగా కఠిన చర్యలు తీసుకోడం లేదని రాస్ చేసిన ప్రకటన అతని దుర్మరణానికి దారి తీసింది.

సోదరుని మరణం నారిస్ మెక్ విక్టర్‌ని ఒంటిగాణ్ణి చేసింది. ఇవాళ 'గిన్నెస్ ప్రపంచ రికార్డుల గ్రంథానికి' ఆయనే ఏకైక సంపాదకుడు. లండన్ నగరం ఉత్తర ప్రాంతంలో గల ఒక ఎర్ర ఇటికల కట్టడంలోని మూడో అంతస్తులో ఉన్న ఆయన ఆఫీసు మిక్కిలి చిందరవందరగా కనిపిస్తుంది. ఎక్కడ చూసినా ఏటేటా ఆయనకు వచ్చే 20,000 లేఖల కట్టలే కనిపిస్తాయి. ఆ లేఖలలో కొన్ని సందేహాలు ప్రకటించేవి: కొన్ని వెనకటి రికార్డులను సవాలు చేసేవి: కొన్ని కొత్త రికార్డుల భోగట్టా తెలియజేసేవి. అన్నీ

## పట్టుపురుగు నుంచి వచ్చే దారం



3 అం.ల కంటె ఎక్కువ పొడ వుండని పట్టుపురుగు తన శరీరంలో నుంచి పసుపు పచ్చని, లేదా తెల్లనిరంగు గల 1,000 గజాల పొడవు దారం వెలికితీసి దానివి తన చుట్టూ గూడుగా అల్లుకుంటుంది. అంత చిన్న పురుగు 1,000 గజాల దారం తియ్యడం మనిషి 15 మైళ్ళ పొడవు దారం వడకడంతో సమానం!

"'లేమి', 'స్వతంత్రత' కలిపి ఉండడం ఇంచుమించు అసంభవం!

డబ్ల్యు. కోబెట్

తరువాతి ముద్రణలో చేర్చబడతాయనే ఆశతో వ్రాసినవి. ఆ ఆఫీసులో పుస్తకాలూ, పత్రికలూ కూడా ఎక్కువగా కనిపిస్తాయి. నారిస్ అవి అన్నీ చదివి స్వయంగా కూడా తన పరిశోధన తాను చేస్తాడు. నమ్మండి, నమ్మకపోండి - గిన్నెస్ ప్రపంచ రికార్డుల గ్రంథంలోని సుమారు 15,000 ఎంట్రీలలో చాలా భాగం నారిస్‌కి కంఠస్థంగా వచ్చు!

ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, వచ్చిన భోగట్టాను సరిచూడడం లాంటి పనులలో సాయం చేసేందుకు ఆ ఆఫీసులో మరో 14 గురు కూడా పనిచేస్తున్నా, ఆ గ్రంథంలో పాటించబడే ప్రధాన సూత్రాలను తయారు చేసేది మాత్రం నారిస్ మెక్ విర్టరే! ఏదో విధంగా 'గిన్నెస్ రికార్డుల గ్రంథం' లో తమ పేరు పడాలని వింత వింత పనులకు పూనుకుంటున్న వారి సంఖ్య నానాటికీ ఎక్కువ అవుతూ రావడం వల్ల కొన్ని సూత్రాలు పాటించడం తప్పనిసరి అయింది. "ఈ రికార్డుల స్వచ్ఛతను కాపాడడం అవసరం" అంటారు నారిస్. "చేసే పని సార్వజనీనమైందీ, పలువురు పోటీచేసేదీ, ప్రత్యేకమైందీ, అసాధారణమైందీ అయినప్పుడే దానికి తన గ్రంథంలో చేరే యోగ్యత వస్తుంది" అని ఆయన నిర్ణయించారు. అందుకే చేపల్ని (gold fish) మింగి మళ్ళీ బయటికి తెప్పించడం లాంటి స్టంట్‌లూ, పాములతో ఒక గదిలో గడపడం లాంటి ప్రమాదకరమైన పనులూ, మద్యసేవనం పోటీలూ లాంటి వాటిని ఆయన ప్రోత్సహించడం లేదు. అసాధారణ పదార్థాలు అరగించడం లాంటివి తగదని హెచ్చరించినా, 1977 లో ఒక బైసికిల్‌ని తిన్న వ్యక్తి పేరు ఆయన ఆ గ్రంథంలో ఎక్కించారు. అయితే—"ఈ వర్గంలో ఇంకే ఎంట్రీలూ స్వీకరించబడవు" అని దాని క్రింద స్పష్టంగా ఒక గమనిక చేర్చారు.

ఇంతవరకూ చదివిన తరువాత— 'ఇంతకూ సర్ హూఫ్ బీవర్‌కి వచ్చిన సందేహానికి సమాధానం ఏమిటి?' అనే కుతూహలం మీలో చాలామందికి కలగడం సహజం. అన్నిటి కంటె వేగంగా ఎగిరే వేట పక్షి 'మెర్గాన్సర్' అనే మెడ క్రింద ఎర్రగా ఉండే ఒక రకం గద్ద. సూటిగా ఎగిరితే గంటకు 128 కి.మీ.ల వేగంగా కూడా అది ఎగురగలదు.

## ఇండియన్ రైల్వేల ఘనత



ఇండియాలో రైళ్ళు రోజూ సగటున 13 లక్షల కి.మీ.ల దూరం నడుస్తున్నాయి. అంటే భూమినుంచి చంద్రుడికి ఉన్న దూరానికి మూడున్నర రెట్లు! దేశంలోని మొత్తం ప్రయాణికులలో సగం మందినీ, రవాణా అయ్యే మొత్తం సరుకులలో 2/3 వ వంతునూ మన రైల్వేలు చేరవేస్తున్నాయి.

# డిపార్ట్‌మెంటల్ స్టోర్‌ల కథ

జో నూజెంట్

బ్యాంకు, స్కూలు, చర్చి మొదలైన వ్యవస్థ అంత దృఢంగానూ వేరూనుకొని, అంతటి ఆత్మీయతాభావాన్నీ ప్రజలలో కలిగిస్తూ, ప్రతి కుటుంబానికీ నేస్తం అయింది డిపార్ట్‌మెంట్ స్టోరు. గుండ్రంగా తిరిగే తలుపుల ద్వారా ఆ స్టోర్ లోపలి ప్రపంచంలోకి చొచ్చుకు పోయిన కొద్దీ కళ్లు చెదరగొట్టే అత్యద్భుత మైన మరో ప్రపంచం చూపరుల కళ్ళ ముందు విచ్చుకుంటుంది. ఆ 'అంతర్జాతీయ సంత బజారు'లో ప్రపంచం నలుమూలల నుంచీ వచ్చే వివిధ తినుబండారాలతో సహా సమస్త పదార్థాలూ లభిస్తాయి. ఒక మాదిరి ఆదాయం గల కుటుంబాలకు అవసరం అయ్యే వస్తువులన్నీ అక్కడ కొనుక్కోవచ్చు.



హారోడ్స్ డిపార్ట్‌మెంట్ స్టోర్స్, లండన్

అతి ప్రాచీన కాలం నుంచీ వివిధ వస్తువులను ఒకే చోట విక్రయించే అంగడులు ఉంటూనే వచ్చినా, భారీ ఎత్తున పెద్ద 'సంత బజారు' లాంటి ఎంపోరియమ్‌ను ఫ్రాన్స్ రాజధాని నగరం పారిస్‌లో 1850 లో ఆరిస్టీడ్ బౌసికాట్ మొట్టమొదట స్థాపించాడు.

"పంచ భూతాల కంటె ముందు నుంచీ ఉన్న ఒక దివ్యాంశ మనందరిలో కచ్చితంగా ఉంది." —సర్ టి. బ్రౌన్

దానికి 'జౌబాన్ మార్చె' ('బలే మంచి చౌక బేరము') అని పేరు పెట్టాడు. అయితే - దానిలో ఎండు ద్రాక్ష వంటి విలువ ఉండే సరుకులు మాత్రమే ఆరంభంలో ఉండేవి. క్రమంగా అవసరమైన అన్ని విధాల సరుకులూ అక్కడ ప్రత్యక్షం అయాయి. తరువాత అనతి కాలంలోనే పారిస్‌లోని ఆ స్టోర్ లాంటివి బ్రిటన్‌లోని లండన్, లివర్పూల్ నగరాలలోనూ, అమెరికాలోని న్యూయార్క్, ఫిలడల్ఫియా, చికాగో నగరాలలోనూ కూడా వెలిశాయి. 'సజీవ గాథలు' (living legends) గా ప్రసిద్ధి పొందిన ప్రపంచంలోని కొన్ని ప్రముఖమైన స్టోర్‌లను గురించి ఇక్కడ మనం చెప్పుకుందాం:

## 'హారోడ్స్' - లండన్:

కార్‌లలో 'రోల్స్ రాయిస్' ఎలాంటిదో డిపార్టుమెంట్ స్టోర్‌లలో ఇది అలాంటి దని ప్రసిద్ధి: యూరప్‌లోని అలాంటి అద్భుతమైన స్టోర్ లన్నిటిలోకీ ఇది పెద్దది. దీనిలోని 214 డిపార్టుమెంట్‌లలో (హాలులలో) తినుబండారాలూ, ఫర్నిచరూ, బట్టలూ, వెండి, బంగారు వస్తువులూ, పుస్తకాలూ, పాదరక్షలూ - ఇవీ అవీ అని ఏమిటి, మీకు ఏ వస్తువు కావాలంటే ఆ వస్తువు దొరుకుతుంది. అక్కడ అమ్మకాలు జరిపే ఉద్యోగులు ఏటా సుమారు 1.4 కోట్ల బేరాలు నిర్వహిస్తారు. గుండు సూది మొదలుకొని గున్న ఏనుగు దాకా ఏది కావాలన్నా వాళ్ళు మీకుసరఫరా చేయగలరు. కాకపోతే - ఆ ఏనుగు గున్నను పెంచే స్తోమతు మీకు ఉందని రుజువు చేసుకోవలసి ఉంటుంది.

'హారోడ్స్' స్టోర్‌లో ఒక బాంకూ, ఒక స్థిరాస్తులు అమ్మే ఆఫీసూ, ఇన్సూర్యెన్స్ డిపార్టుమెంట్, అంత్యక్రియలకు ఏర్పాట్లు చేసే కార్యాలయం, ఒక సర్క్యులేటింగ్ లైబ్రరీ కూడా ఉన్నాయి. లండన్‌లో ఇప్పుడు మిగిలి ఉన్న సర్క్యులేటింగ్ లైబ్రరీ అది ఒక్కటే:

ఏడాది పొడుగునా 4,000 మందీ, క్రిస్టమస్ సీజన్‌లో 6,000 మందీ పని వారు ఈ స్టోర్‌లో పనిచేస్తూ ఉంటారు. 'హారోడ్స్'కు

## మిక్కిలి పెద్ద విహార నౌక



ప్రపంచంలో మిక్కిలి పెద్ద విహార నౌక 'క్వీన్ ఎలిజబెత్' పొడవు 963 అ.లు. 13 అంతస్తుల ఎత్తు. గంటకు ఇది 28 నాట్‌ల వేగంతో పయనిస్తుంది. రెస్టారెంట్‌లు, ఒక హెల్త్ క్లబ్, ఈత కొలనులు, ఆధునిక హంగులు గల ఒక జిమ్నాసియమ్, గోల్ఫ్ క్రీడాస్థలం, 500 సీట్లు ఉన్న ఒక సినిమా హాలు, లైబ్రరీ, ఆసుపత్రి, బ్యూటీ పార్లర్ మొదలైన విలాస జీవితానికి కావలసిన హంగులన్నీ దీనిలో ఉన్నాయి. అత్యాధునికమైన భద్రత ఏర్పాట్లు కూడా ఉన్నాయి.

"'జీవితం' మానవుని 'అమరత్వం' తాలూకు బాల్యదశ!" —గొయిథే

అంత ప్రజాదరణ లభించడానికి కారణం దాని వినోద దాయక లక్షణం అని దాని మేనే జింగ్ డైరక్టర్ అలెక్ క్రాడక్ అంటారు: "ప్రపంచంలోని గొప్ప ప్రదర్శనలలో అది ఒకటి!"

'మార్షల్ ఫీల్డ్ అండ్ కో' - చికాగో :

సుమారు 100 ఏళ్ళ క్రితం ఒక రైతు బిడ్డ మార్షల్ ఫీల్డ్, చికాగోలో తన పేరు మీదుగా స్థాపించిన ఈ స్టోర్ ఈ నాడు ప్రపంచ ఖ్యాతి పొందింది. "అమ్మగారికి ఏది కావాలంటే అది ఇవ్వండి!" అనే మార్షల్ ఫీల్డ్ 'ఆశయ వాక్యం' (dictum) ఫలితంగా ఈ నాడు ఒక రాజ దర్బారు అవసరాలను కూడా అది తీర్చగలదు. చికాగో సందర్శించే పర్యాటకులు సహజంగానే 'ఫీల్డ్' వైపు ఆకర్షించబడు తారు. మ్యూజియమ్‌లు, సంగీత మందిరాలు, క్రీడల స్టేడియమ్‌ల కంటె కూడా ఎక్కువ మంది ప్రేక్షకులను అది ఆకర్షిస్తుంది.

'మిట్సు కోషి' - టోకియో :

జపాన్‌లో మిక్కిలి పెద్దదీ, సుప్రసిద్ధ మైందీ ఈ స్టోర్. ఇది కేవలం షాపింగ్ జరిపే మార్కెట్ మాత్రమే కాదు. కొతావారుల సాంస్కృతిక జీవితంలో కూడా ఒక ప్రధాన భాగం ఇది. ఇక్కడి ఆర్ట్ మ్యూజియమ్‌లో ప్రపంచప్రముఖ కళాకారుల కళాఖండా లన్నీ ఉన్నాయి. ఇక్కడి 'సంస్కృతి కేంద్రం' (cultural centre) లో ఆరోగ్యం, సౌందర్యపోషణ, వంటలు - వార్పులు, జపాన్ జానపద కళలు, సాహిత్యం, సాధా రణ విజ్ఞానం (general education), విదేశీ భాషలు - మొదలైన వివిధ అంశాలకు సంబంధించిన 200 తరగతులు నడుస్తూ ఉంటాయి. ఈ స్టోర్ తాలూకు విదేశాలలో సరుకు బట్వాడా చేసే విభాగం, గిఫ్ట్‌ల పంపకం విభాగం రోజుకి 2.5 లక్షల పార్సెల్‌లు పంపించగలవు.

'కా.డె వె.' - బెర్లిన్ :

75 ఏళ్ళ క్రితం బెర్లిన్‌లోని ఒక వ్యాపారస్థుడు ఒక ఆర్కిటెక్ట్‌ను పిలిచి బెర్లిన్‌లో 'కౌఫాస్ డెస్ వెస్టెన్స్' (పాశ్చాత్య దేశాల డిపార్ట్‌మెంట్ స్టోరు) నిర్మించ వలసిందిగా

## మొట్టమొదటి బెలూన్ యాత్ర



జీన్ ఫ్రాంకొయిస్ పిలాట్ర్ డీ రోజియ, ఫ్రాంకొయిస్ లారెట్ మార్విస్ డీ అర్లం డీస్ అనే ఇద్దరు ఫ్రెంచ్‌వారు 1783 నవం బరు 21 న మొట్టమొదటిసారిగా వేడిగాలి నింపిన బెలూన్ సాయంతో ఆకాశంలో ఎగిరారు. ఆ బెలూన్‌కి కట్టిన ఒక తట్టలో కూర్చుని ఆ ఇరువురూ పారిస్ నగరానికి 1,000 మీటర్ల ఎత్తున సుమారు 9 కి.మీ.ల దూరం పయనించారు.

" 'మంది' ని ఎన్నడూ అనుసరించకు!" —బి.ఎమ్. బరూఖ్

ఆదేశించాడు. ప్రస్తుతం 'కౌ.డె.వె.'గా ప్రసిద్ధమైన ఆ స్టోరును ఏటా ప్రపంచం నలుమూలల నుంచీ సుమారు 2.3 కోట్ల మంది కొతాదార్లు సందర్శిస్తున్నారు. ఇక్కడి 'తినుబండారాల' విభాగంలో ప్రపంచంలో ఏ దేశం తాలూకు ఏ వంటకమైనా లభిస్తుంది. మొత్తం 25,000 'స్టేట్ డిపార్ట్‌మెంట్ స్టోర్'గా లెనిన్ చేత ప్రారంభించబడిన ఈ 'జి.యు.ఎమ్.' రష్యాలోని 100 రకాల విభిన్న జాతుల తాలూకు ప్రజల అభిరుచులను సంతృప్తిపరిచే సమస్త వస్తువులనూ సరఫరా చేస్తూంది. ప్రత్యేక వైద్య నిపుణులు నిర్వహించే ఒక క్లినిక్, 27,000



జడ్. సి. ఎమ్. ఐ - డిపార్ట్‌మెంట్ స్టోర్ (సాల్ట్‌లేక్ సిటీ, అమెరికా)

తిను బండారాలు - ఆ యా దేశాల పేర్లతో సహా - ఇక్కడ ప్రదర్శించ బడుతున్నాయి.

'జి. యు. ఎమ్.' - మాస్కో :

మాస్కోలోని రెడ్ స్క్వేర్‌లోని 'జి.యు.ఎమ్' - స్టోర్ రష్యన్ ప్రభుత్వం నిర్వహిస్తున్న స్టోరు. ప్రతి నెలా 8.3 కోట్ల రుబుల్‌ల (10.6 కోట్ల డాలర్ల) వ్యాపారం ఈ స్టోర్‌లో జరుగుతూంది. 8,000 మంది ఉద్యోగులు రోజూ 3 లక్షల మంది కొతాదారుల అవసరాలు తీరుస్తున్నారు. 1921 లో సంపుటాలు గల ఒక లైబ్రరీ, ఒక పిల్లలను సముదాయించే కేంద్రం (child care centre) కూడా ఈ స్టోర్‌లో భాగాలుగా నిర్వహించ బడుతున్నాయి.

## పరమాణు విద్యుచ్ఛక్తి ప్రాజెక్ట్‌లలో పని చేసేవారు

ఇండియాలో వివిధ పరమాణు విద్యుచ్ఛక్తి ప్రాజెక్ట్‌లలో 1967 లో 500 మంది మాత్రమే పనిచేస్తూ ఉండగా, 1981 నాటికి ఆ సంఖ్య 2,500 కి పెరిగింది.

"ఒంటరిగా ప్రయాణించేవాడు మరింత వేగంగా ప్రయాణిస్తాడు!" —కిప్లింగ్

- అట్లాంటా :

"ప్రియమైన పలు కథలు ప్రచారంలో ఉన్న స్టోర్ రిఛ్స్" అని అట్లాంటా రచయిత సెలిస్టిన్ సిబ్లీ వర్ణించారు. కొన్ని సంవత్సరాల క్రితం కొన్న వస్తువులైనా సంతృప్తి కలిగించని పక్షంలో వాపసు తీసుకున్న సందర్భాలెన్నో ఈ 'రిఛ్స్' స్టోర్‌ను గురించి ప్రచారంలో ఉన్నాయి. "కాతాదారు చెప్పిందే రైటు; దానికి మరి తిరుగు లేదు."

'బ్లూమింగ్ డేల్స్' - న్యూయార్క్ :

ఈ స్టోర్‌కి వచ్చే కాతాదారులలో జాకీ ఒనాసిస్, బ్జోర్న్ బోర్గ్, డెన్మార్క్ రాకుమారి బెనెడిక్ట్ వంటి జగద్విఖ్యాతులెందరో ఉన్నారు. 1976 లో ఇంగ్లండ్ రాణి ఈ 'బ్లూ మీస్'ను సందర్శించారు.

'లేన్ క్రాఫర్డ్' - హాంగ్‌కాంగ్ :

'లేన్ క్రాఫర్డ్'లో టెయిలరింగ్, డ్రాఫ్టింగ్, మద్య విక్రయం, ఫాషన్ సెంటర్ లాంటి విభాగాలెన్నో ఉన్నాయి. ఈ స్టోర్ షెల్ఫుల మీద ప్రాచ్య, పాశ్చాత్య దేశాల నుంచి తెప్పించిన ఆవశ్యక వస్తువులూ, భోగ వస్తువులూ ప్రదర్శించ బడుతున్నాయి. ఈ స్టోర్ తాలూకు నినాదం: "మీకు ఏది కావాలన్నా సరే 'లేన్ క్రాఫర్డ్'కి రండి!"

'మాసీస్' - న్యూయార్క్ :

ప్రపంచంలో ఒకే కప్పుక్రింద ఉన్న స్టోర్లన్నిటిలోకీ ఇది పెద్దది. అమెరికాలో మిక్కిలి విఖ్యాతి చెందిన స్టోర్ కూడా ఇదే! అమెరికన్ల వాడుకలో కొత్త నుడికారాలను ఈ స్టోర్ కల్పించింది. 'మాసీస్ బేస్‌మెంట్' అంటే 'జనం క్రిక్కిరిసి ఉన్న చోటు' అనీ, 'మాసీస్ విండో' అంటే జనం ఎక్కువగా చేరే పబ్లిక్ ప్రదేశం అనీ అర్థాలు వచ్చేశాయి.

## భూమినుంచి దూరం అయిన చంద్రుడు



గత 200 సం.లు గా భూమినుంచి చంద్రుడు ఎంత దూరంలో ఉంటూ వచ్చాడో ఇటీవల కాలంలో అంతకంటె మరింత దూరం అయినట్టు శాస్త్రవేత్తలు గుర్తించారు. మిన్నిసోటా విశ్వవిద్యాలయం (అమెరికా) లోని మార్క్ స్లోవక్ అనే ఖగోళ శాస్త్రవే[త్త] ప్రస్తుతం భూమి నుంచి చంద్రుడు 4,04 350 కి.మీ. ల దూరంలో ఉన్నాడనీ, ఇ[ది] మామూలు దూరంకంటె 1,600 కి.మీ. [ల] ఎక్కువ అనీ, సూర్యుడూ, చంద్రుడూ కొన్ని పెద్ద గ్రహాలూ ప్రస్తుతం ఉన[్న] ఉనికి ఇందుకు కారణమనీ ప్రకటించారు

"'అజ్ఞానం' మనస్సుకు 'రాత్రి';
చంద్రుడూ, నక్షత్రాలూ లేని కాళరాత్రి!" —కన్‌ఫ్యూషియస్

'మైయర్' - మె

ఆస్ట్రేలియాలోని ఈ 'మైయర్ డిపార్ట్ మెంటల్ స్టోర్‌ల పరంపర' 1981 సెప్టెంబరులో తన 70 వ జన్మదినోత్సవం జరుపుకుంది. ఆస్ట్రేలియా అంతటా వ్యాపించి ఉన్న ఈ స్టోర్‌లు ఏటా 100 కోట్ల డాలర్ల వ్యాపారం చేస్తున్నాయి. 1898 లో బంగారం అన్వేషణ కోసం ఆస్ట్రేలియాకు వచ్చిన పిడ్నీ మైయర్ అనే రష్యన్ ఈ స్టోర్‌ల పరంపరను స్థాపించాడు.

స్టటాఫర్డ్ - కేప్ టౌన్:

లండన్ నగరానికి చెందిన శామ్సన్ రికార్డ్ స్టటాఫర్డ్ 1857 లో ద. ఆఫ్రికాలోని కేప్‌టౌన్‌లో హారింగ్‌టన్ వీధిలో ఒక రెండంతస్తుల మేడలో ఈ స్టోర్‌ను మొదట ప్రారంభించాడు. దక్షిణ ఆఫ్రికాలోని వజ్రాల వ్యాపారం వల్ల బాగా బలం పుంజుకొని క్రమంగా జోహానెస్ బర్గ్, దర్బాన్, లండన్ నగరాలకు కూడా ఈ స్టోర్ తాలూకు శాఖలు విస్తరించాయి.

"భవిష్యత్తులో డిపార్ట్‌మెంట్ స్టోర్‌లు వెనుకటి లాగా ఖాతాదారులతోనూ, వారి కుటుంబాలతోనూ ప్రీతి పూర్వక మైన సంబంధాలు కలిగి ఉంటాయా?" అంటే నిస్సందేహంగా 'ఉండవు' అని జవాబు చెప్పవచ్చును. కాలక్రమేణ అన్ని పనులూ కంప్యూటర్లూ, రొబట్ మరమనుషులూ నిర్వర్తించే పరిస్థితి వస్తే చిన్న చిన్న స్టోర్‌ల నన్నిటినీ కబళించి మిక్కిలి పెద్ద పెద్ద స్టోర్‌లు అవతరించడం, ప్రతి కుటుంబానికీ నేస్తంగా ఉండిన వెనుకటి స్టోర్‌లు అంతర్ధానం కావడం జరుగక తప్పదు!

('ది రొటేరియన్' సౌజన్యంతో)

---

## రోడ్డు ప్రమాదాలలో హతులు



ప్రపంచంలో ప్రతి ఏడూ రోడ్డు ప్రమాదాలవల్ల సుమారు 2,50,000 మంది మరణిస్తున్నారు. ఒక్కడు హతుడైతే 10,15 మంది తీవ్రంగా గాయపడడం, 30,40 మంది స్వల్పంగా గాయపడడం జరుగుతూంది. కొన్ని దేశాలలోని పెద్ద పెద్ద ఆసుపత్రులలో దాదాపు 10 శాతం పడకలను రోడ్డు ప్రమాదాలలో గాయపడిన వారే ఆక్రమిస్తున్నారు. 15-25 ఏళ్ళ వయోవర్గంలోని వారిలో సంభవించే మరణాలలో 30 శాతం రోడ్డు ప్రమాదాలవల్లనే సంభవిస్తున్నాయి

---

" 'అజ్ఞానం' ఆనందంగా భ్రమించే చోట
'జ్ఞానం' వట్టి తెలివి తక్కువది!" —థామస్ గ్రే

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలూ ఈ శీర్షిక క్రింద ప్రచురించ బడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5 లు మనియార్డరు ద్వారా పంపండి.—సంపాదకుడు.)

1. సి హెచ్. వెంకటేశమ్, 19 సం. లు, జనరల్ స్టోర్స్, చేగుంట గ్రామం, మెదక్ జిల్లా. 502 255.

కలం స్నేహం, కొత్తవారితో స్నేహం, పుస్తక పఠనం.

2. పి జానకిరామయ్య, 32 సం.లు, ఫ్లేట్, డి.పి.యమ్.ఎస్. బిల్డింగ్స్, రైల్వే స్టేషన్ వద్ద, కాకినాడ—533 004.

సంగీతం, సాహిత్యం, విహారయాత్రలు.

3. ఎన్. రాజశేఖర్, S/o ఎన్. రామస్వామి, ఇం. నెం. 4-2-33, బస్తీ నెం. 14, యెల్లందు పోస్టు. ఖమ్మం జిల్లా.

కవితలు వ్రాయడం, గ్రంథాలయానికి వెళ్ళడం, స్త్రీలను గౌరవించడం.

4. పబ్బులు కృష్ణమూర్తి, C/o స్వప్న జిరాక్స్ సెంటర్, మమతా నగర్, మిర్యాలగూడ—508 207, నల్గొండ జిల్లా.

కలం స్నేహం, పత్రికలు చదవడం.

5. కె. రాగిణి సన్య. 21 సం. లు, C/o కె రామారావు, వినార్ టైలర్స్, కొత్తరోడ్డు. విశాఖపట్నం—530 001.

కలం స్నేహం, చిత్రలేఖనం, కళారాధన.

6 మోదుగు శ్రీనివాస్. 21 సం.లు, ప్రొప్రయిటర్, భార్గవి రైస్ కార్పొరేషన్, షాబూనగర్, మిర్యాలగూడ — 508 207 (నల్గొండ జిల్లా).

## ఇండియన్ తొలి వ్యోమగామికి అశోక చక్రం



అంతరిక్షయానం చేసి వచ్చిన తొలి భారతీయుడు స్క్వాడ్రన్ లీడర్ రాకేష్ శర్మ, ఆయనతోపాటు ప్రయాణించిన రష్యన్ వ్యోమగాములు యూరీ మాలిషేవ్, గెన్నడీ స్ట్రెకలోవ్‌లు ప్రదర్శించిన ధైర్య సాహసాలకుగాను భారత ప్రభుత్వం వారికి 'అశోక చక్రం' ఇచ్చి గౌరవించింది.

---

"తమ అజ్ఞానాన్ని గురించిన అజ్ఞానమే అజ్ఞానుల జాడ్యం!" —ఏ.బి. ఆల్కాట్

వ్యాపార సంబంధమైన విషయాలను చర్చించడం, ఫొటోల సేకరణ, స్నేహాన్ని అన్వేషించడం.

7. బి. రఘు, 20 సం.లు, C/o వెంకటరమణ ప్రింటింగ్ ప్రెస్, వేములవాడ పోస్టు, (కరీంనగర్ జిల్లా), 505 302.

పుస్తకాలు చదవడం, క్రికెట్ కామెంట్రీ వినడం, చదరంగం ఆడడం.

8. ఎజాజ్ అహమ్మద్ 'పర్వెస్' 17 సం లు S/o ఎం ఏ. రజాక్, ఫ్లోర్ & నూనె మిల్స్, మెయిన్‌రోడ్డు, తా॥ కోడంగల్, మహబూబ్‌నగర్ జిల్లా, 509 338.

కలం స్నేహం ద్వారా వివిధ ప్రాంతాల వారి సంస్కృతి, ఆచార వ్యవహారాలు తెలుసుకోడం, మంచి గ్రంథాలు చదవడం, కవితలు వ్రాయడం.

9. ఎల్. రమేశ్‌బాబు, 27 సం.లు, ఇంటర్ రెండవ సం.రం విద్యార్థి, మద్దూరు గ్రామం, హైతాబాద్ పోస్టు, (వయా) శాబాద్, రంగారెడ్డి జిల్లా, 509 217.

సినీమాలు చూడడం, పత్రికలు చదవడం, కలం స్నేహం.

10. పి. మంజునాథ రావు, S/o పి. శ్రీనివాసరావు, బి.డి.ఓ. పమిడి—515 775.

కలంస్నేహం, పుస్తకపఠనం, సినీమాలు చూడడం.

11. పి.ఆర్. మందేశ్వరావు, బి.ఎస్‌సి, క్లర్క్, ఇస్యూ సెక్షన్, ఆఫీస్ ఆఫ్ జనరల్ మేనేజర్, టెలీ కమ్యూనికేషన్స్, హైద్రాబాద్—500 001.

కవిత్వం, వ్యాసరచన, చదరంగం.

12. సి. హెచ్. సుదర్శన్, 20 సం.లు, ఐ.టి.ఐ, S/o కొమరయ్య, ఇం. నెం. 363, 3 వ జోన్, కల్యాణిఖని పోస్టు, ఆదిలాబాద్ జిల్లా, 504 231.

ప్రయాణాలు చేయడం, ప్రకృతి ఆరాధన, నవలలు చదవడం.

## ఇండియన్ ఫాన్‌ల ఎగుమతిలో తగ్గుదల



1980-81 లో ఇండియా రూ. 16.5 కోట్ల ఖరీదు చేసే ఫాన్‌లూ, ఫాన్‌ల విడి భాగాలూ ఎగుమతి చేసింది. 1981-82, 1982-83 లలో ఈ మొత్తం రూ. 15 కోట్లకు పడిపోయింది. ప్రస్తుతం ప్రపంచ విపణిలో ఇండియన్ ఫాన్‌లు 5 శాతం మాత్రమే. హాంగ్‌కాంగ్, జపాన్, తైవాన్‌లు (అన్నీ ఆసియా దేశాలే) ఈ రంగంలో అగ్రస్థానంలో ఉన్నాయి.

"ఏమీ చెయ్యని వాడే కాదు, చేయగలిగి కూడా అంతకంటె మంచి పనులు చెయ్యని వాడూ సోమరే." —సోక్రటీస్

# చేపల వింత అలవాటు

ఎస్. శ్రీనివాస రంగన్

రంగు మార్పిడీ:

కొన్ని చేపలకు ప్రత్యేకమైన వాటి ఆకారం, సమయానుగుణంగా రంగు మార్చే స్వభావం, ఇతర చేపలను అనుకరించగల ప్రజ్ఞా తమ శత్రువుల బారి నుంచి తప్పించు



SEA DRAGON [PHYCODURUS EQUES]

కోడానికి సాయం చేస్తాయి. 'ప్రోక్యుపైన్' చేపకూ, మూడు కాళ్ళ చేపకూ, ఆవు చేపకూ, గోళీ చేపకూ, తేలు చేపకూ మిక్కిలి విషపూరిత మైన ముళ్ళు ఉంటాయి.

గొట్టం చేప (pipe fish-syngnathidae) రంగులోనూ, ఆకారంలోనూ తాను నివసించే ప్రాంతంలోని సముద్రపు నాచును పోలి ఉంటుంది.

ఆస్ట్రేలియా తీరంలోని "సీ డ్రేగన్" అనే చేప తాలూకు శరీరం అంతా ముళ్ళు ముళ్ళుగా, పొరలు పొరలుగా చీలిపోయి ఆకులతో కూడిన ఒక చిన్న రెమ్మలాగ కనిపిస్తుంది. సముద్రపు నాచు మధ్య ఇది ఈదుతూ పోతున్నప్పుడు ఇంచుమించు ఆ నాచులో ఒక భాగంలాగే అనిపిస్తుంది. పరిసరాల కనుగుణంగా రంగులు మార్చే స్వభావం బల్లపరుపు చేపల (flat fishes) లో చాలా ఎక్కువగా కనిపిస్తుంది.

సాధారణంగా పగడపు దీవుల పరిసరాలలో కనిపించే చేపలు తక్కిన చేపలకంటె ఉజ్జ్వల వర్ణాన్ని కలిగి ఉంటాయి. జాంజిబార్ తీరంలో లభించే ఒక రకం 'సీతాకోక చిలుక చేప' (butterfly-fish) ల తోకమీద ఒకవైపున ప్రాచీన అరబిక్ అక్షరాలలో 'లాయిల్లానా ఇల్లల్లహ్' ('అల్లా' తప్ప మరో దేవుడు లేడు) అనే వాక్యం కనిపిస్తుం దని ప్రకటించారు. ఈ చేపను 'అల్లా' చేప అని ప్రజలు వ్యవహరిస్తున్నారు.

---

## మెదడులో లైబ్రరీ!

లిథువానియా (రష్యా) అధినేత ఎలిజాబెన్ సాలమన్ మెదడు లైబ్రరీగా ఉపయోగపడేది. సుమారు 2,500 గ్రంథాలు (కొన్ని హీబ్రూ మత గ్రంథాలతో సహా) ఆయన ధారణ పట్టారు. వాటిలో ఏ పుస్తకంలో నుంచి ఏ భాగాన్ని అయినా ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆయన వప్పజెప్ప గలరు.

"ప్రజాసామాన్యం ఎప్పుడూ చౌకబారు భావాలనే ఆదరిస్తుంది." —సి.ఎస్. పీర్స్

'దోమగుడ్ల సంహారిణి' (Gambusia affinis) అనే చేప రంగులు మార్చడంలో పెట్టింది పేరు. నల్లని నీటి తొట్టెలో వేస్తే నల్లగానూ, తెల్లటి నీటి తొట్టెలో వేస్తే తెల్లగానూ అది కనిపిస్తుంది.

చాలా రకాల చేపలలో అవి ఎదుగుతున్న కొద్దీ వాటి రంగులో మార్పు వస్తుంది. ఉదాహరణకు: 'ముర్రెల్' చేపలు చిన్నవయస్సులో రక్తవర్ణంగానూ, బాగా ఎదిగిన తరువాత చుక్కలూ, చారలూ గల బూడిద వన్నెగానూ ఉంటాయి. ఈ సంగతి తెలియని అమాయికులకు కొందరు వర్తకులు 'బంగారు చేపలు' (gold fish) అని చెప్పి, వాటిని అమ్ముతున్నారు.

ఆహారం అలవాట్లు:

చాలా చేపలకు నోటినిండా పళ్ళు ఉంటాయి. దవుడలలోనే కాక నోటిపై కప్పులోనూ, నాలుకమీదా కూడా పళ్ళు కనిపిస్తాయి. అయితే వాటికి అవి ఆహారం నమలడానికి ఉపయోగించేవి కావు. సాధారణంగా చేపలు తమ ఎరను పట్టుకోడానికీ, అది తప్పించుకుపోకుండా అటకాయించడానికీ మాత్రమే ఈ పళ్ళను వాడుక చేస్తాయి. షార్క్ చేపలలో వెనుకకు వంపు తిరిగి ఉండే పళ్ళు ఈ విషయాన్ని స్పష్టంగా రుజువు చేస్తున్నాయి. చాలా రకాల చేపలలో పోయిన పళ్ళ స్థానే కొత్తపళ్ళు మొలిపించుకునే శక్తి అపారంగా కనిపిస్తుంది.

'గాలం చేప' (angler fish) తలమీద ఒక గాలం, దాని చివర ఎర ఉంటాయి. అది కనపడకుండా బురదలో నక్కి ఉంటుంది. తలమీది ఆ గాలం, ఎర మాత్రమే పైకి కనిపిస్తాయి. ఆ ఎర చూసి ఆకర్షించబడ్డ దురదృష్ట జీవి దాని నోటి చేరువకు రాగానే దాన్ని అది కబళిస్తుంది.



'విలుకాడు చేప' (archer fish) ఆహారం సంపాదించుకునే విచిత్రమైన విధానం వల్ల దానికా పేరు వచ్చింది. నీటి పైభాగాన ఎగురుతూ గాని, లేదా గడ్డిమీదో, మొక్కలమీదో ఏదైనా ఈగ వాలి గాని కనిపిస్తే ఈ చేప మెల్లగా దానిని సమీపించి గురి చూసి తన నోటినుంచి ఒక నీటి బిందువును

---

## థాయ్‌లాండ్ పిల్లలకు సంస్కృతం పేర్లు

థాయ్‌లాండ్ (ఆగ్నేయ ఆసియా) లో పుట్టిన ప్రతి కొత్త శిశువుకీ - ఆ శిశువు ఏ మతానికి చెందినా సరే - అక్కడి ప్రధాన దేవాలయాలలో ప్రకటించిన పేర్ల జాబితాలో నుంచే ఏదో ఒక పేరు పెట్టాలి. ఆ జాబితాలోని పేర్లన్నీ సంస్కృతం పేర్లే!

"ఇతరుల అభ్యుదయానికి తోడ్పడేవాడు ఆదర్శవాది!" —హెన్రీ ఫోర్డ్

దానిమీద ప్రయోగిస్తుంది. మరుక్షణం ఆ ఈగ నీటిలో పడడం, ఆ చేప దానిని స్వాహా చెయ్యడం జరుగుతుంది. ఈ 'విలుకాడు చేప' గురి చాలా కచ్చితమైంది. నీటి పై భాగాన కొంత దూరంలో ఎగురుతున్న ఈగను కూడా అది చక్కగా గురిచూడగలదు.



AMGLER FISH [PHOTOCORYNUS SPINICEPS]: FEMALE ♀ WITH PARASITIC MALE ♂

చేపలలో అన్యోన్యజీవులు (parasites) కూడా ఉన్నాయి. 'గాలం చేపల'లో మగది ఆడదాని శరీరాన్ని అంటి పెట్టుకుని ఉంటుంది. ఆ రెండిటి రక్తనాళాల మధ్య 'బొడ్డుతాడు' (placenta) లాంటి అనుబంధం ఉంటుంది. తల్లి తన కడుపులోని శిశువుకు పోషణ అంద జేసినట్టు ఆడచేప మగచేపను పోషిస్తూ ఉంటుంది. కొన్నాళ్ళకు మగచేప నోరు నిర ర్థకమై అంతరించిపోతుంది.

ప్రపంచంలో మిక్కిలి పెద్దది తిమింగిలం (whale) చేప. 50 అడుగుల పొడుగు దాకా ఇది ఎదుగుతుంది. నీటి మీద తేలుతూ పోయే సూక్ష్మజీవుల సముదాయాన్ని (plankton) ఇది ఆహారంగా గ్రహిస్తూ శరీరాన్ని పెంచు కుంటుంది.

ఇతర చేపల దేహాల మీదా, పొలుసుల మీదా ఆధారపడి బ్రదికే 'అన్యోన్యజీవు'ల (parasites) ను అరగించే విచిత్రమైన అల వాటు కొన్ని చేపలలో కనిపిస్తుంది. వీటిని 'పాకీ చేపలు' (cleaner fishes) అంటారు. సుప్రసిద్ధమైన 'రెమోరా' చేప ఇలాంటి ఒక 'పాకీ చేప'. ఇది ఎక్కువ కష్టపడకుండా

---

(14 వ పేజీ తరువాయి)

తంగా పనిచేయడం వల్లనే అది సాధ్యం అయింది. 11 నెలలపాటు నిరంతర జాగ రూకతతో కృషిచేసి ఎలాంటి మరకలు (strains)గాని, సరిగా చల్లబరచక పోవడం వల్ల వచ్చే లోపాలు గాని లేకుండా ఆ భూత ద్దాన్ని పోతపోశారు. ఇక దానికి పాలిష్ చెయ్యడంలో అంగుళంలో 10 లక్షల వంతు దాకా కచ్చితంగా ఉండేట్టు చూశారు. ఆ విషయంలో ఏమాత్రం పొరపాటు జరిగినా మొత్తం ప్రయత్నం అంతా బూడిదలో పోసిన పన్నీరు అయేది!

భూతద్దం తయారయిన తరువాత దానిని గొట్టంలో అమర్చడం మరొక భగీరథ ప్రయత్నం. సుప్రసిద్ధ ఖగోళ శాస్త్రవేత్తల, ఇంజనీర్ల మేధాశక్తి, అనుభవం అందుకు అవసరం అయాయి. మొత్తం ఆ దూరదర్శిని బరువు 10 లక్షల పౌన్లు. ఖగోళ శాస్త్ర సంబంధమైన ఒక పూర్తి ప్రయోగశాలను ఇముడ్చడానికి వీలయినంత పెద్దది ఆ టెలి

అన్నిటి కంటె అద్భుతమైన విషయం ఏమిటంటే - ఇంత బరువైన, బ్రహ్మాండ మైన టెలిస్కోప్‌ను - అడుగున ఆయిల్ బేరింగ్స్ మీద దానిని అమర్చడం వల్ల - ఒక్క వేలితో ఎలా కావాలంటే అలా కదు పుకో వచ్చు!

"రాతు కొద్దీ గుర్రం!" - తెలుగు సామెత

సులువుగా అన్యోపజీవులను అరగిస్తూ జీవిసుంది.

చేపల వలస :

సముద్రపు చేపలూ, మంచి నీటి చేపలూ కూడా వలసపోతూ ఉంటాయి. వేల కొద్దీ మైళ్ళు ప్రయాణించాలనే ప్రేరణ శారీరకంగానే వాటికి కలుగుతుంది. ఆహారం కోసం అయితే కొద్ది కొద్ది దూరాలే చేపలు వలస పోతాయి. గుడ్లు పెట్టేందు కయితే సుదూర ప్రయాణాలు చేస్తాయి.

మంచినీటి నెలవులకు వలసపోయే చేపలు (Anadromous fishes) కొంత కాలం సముద్రంలో గడిపి గుడ్లు పెట్టేందుకు నియత వ్యవధానాలలో మంచినీటి నదులలోకి పోతూ ఉంటాయి. 'సీ లాంప్రే', 'స్టర్జియన్', 'శ్నాడ్', 'సాల్మన్' వంటి చేపలు ఇందుకు చక్కని ఉదాహరణలు. ఇండియాలో గుడ్లు పెట్టేందుకు వలసపోయే చేపలలో 'హిల్సా' సుప్రసిద్ధ మైంది. తిరుచిరాపల్లి సమీపాన కావేరీనది మీది ఆనకట్ట వద్ద ఏటా వేలాది 'హిల్సా' చేపలను పడుతూ ఉంటారు. గుడ్లు పెట్టడానికే హిల్సా చేప సముద్రం నుంచి మంచినీటి నదులలోకి ప్రయాణిస్తుంది. గుడ్లు పెట్టే స్థలం చేరుకునేలోగా దానికి అవరోధం ఏర్పడితే గుడ్లు పెట్టడాన్ని అది వాయిదా వేస్తుంది. ఉత్తర అమెరికాలోని పసిఫిక్ తీరంలోని సాలమన్ చేపలు దాదాపు 2,400 మొదలు 3,600 కి.మీ. ల దాకా ప్రయాణించి నదిలోని గుడ్లుపెట్టే నెలవులను చేరుకుంటాయి. సాలమన్ ఈల్ వంటి సర్పాకారపు చేపలు యూరప్‌లోని నదులనుంచి 4,800 మొదలు 6,000 కి.మీ. ల దూరం ప్రయాణించి అమెరికన్ సముద్రంలోని వాటి గుడ్లు పెట్టే నెలవులను చేరుకుంటాయి.

అంతంత దూరం చేపలు వలసపోతూ ఉండడం, గుడ్లు పెట్టిన తరువాత ఆ పిల్లలతో సహా తిరిగి తమ స్వస్థలాలు చేరుకుంటూ ఉండడం అమితాశ్చర్యకరంగా కనిపించే విషయాలు!

(సశేషం)

## ప్రపంచ మోటార్ సైకిలు ఛాంపియన్



పశ్చిమ జర్మనీ మోటార్ సైకిలిస్ట్ టోనీ మంగ్ 1980, 1981, 1982 ప్రపంచ మోటార్ సైకిల్ పోటీలలో వరుసగా ఛాంపియన్‌షిప్ సాధించాడు. తన జీవిత కాలంలోనే ఒక రోడ్డుకి తన పేరు పెట్టడం జరిగిన కొద్ది మంది ధన్యజీవులైన జర్మన్‌లలో ఆయన ఒకరు. ఎగువ బవేరియాలోని 'ఇన్నింగ్ ఆన్ అమ్మెర్‌సీ' అనే గ్రామంలో ఉంటున్న ఆయన అడ్రస్సు: 'టోనీ మంగ్ రింగ్.'

"ఆకలితో చావడం కన్న ఆహవం (యుద్ధం)లో చావడం మేలు." —ఛార్టిస్ట్స్

# పసిడి తారాజాలు

# బెర్నార్డో ఆల్బెర్టో హౌస్సే

మెదడు అడుగున అండాకారంగా ఉండే పెంకు రంగు చిన్న అవయవం చాలా కాలంగా వైద్యశాస్త్ర నిపుణులను తికమక పెడుతూ వచ్చింది. 'పిట్యూటరీ గ్రంథి' అన



బడే ఆ అవయవాన్ని గురించి ఎన్నో అపోహలు వైద్యులలో ప్రచారంలో ఉండేవి. మన ముక్కు నుంచి వచ్చే చీమిడి ఈ గ్రంథి నుంచే వస్తుందని కూడా కొందరు అపోహపడేవారు. ఆ గ్రంథి చాలా ప్రమాదకరమైన అవయవం అని శాస్త్రవేత్తల కెవ్వరికీ ఆ నాడు అనుమానం కూడా రాలేదు.

నిజానికి ఆ గ్రంథి చాలా ప్రమాదకరమైంది. సుప్రసిద్ధ అర్జెంటీనా వైద్య శాస్త్ర నిపుణుడు డా॥ బెర్నార్డో ఆల్బెర్టో హౌస్సే చక్కెర పదార్థాలను జీవశక్తిగా మార్చే ప్రక్రియలో ఈ పిట్యూటరీ గ్రంథి ఎంత కీలకమైన పాత్ర నిర్వర్తిస్తున్నదో నిరూపించారు. క్షీణింపజేసే మధుమేహ (diabetes) వ్యాధి చికిత్సకు తన పరిశోధనల వల్ల ఆయన రాచబాట వేశారు.

నల్లని కళ్ళతో కుదిమట్టంగా ఉండే డా॥ హౌస్సే సత్యాన్వేషణ దీక్షతో శాస్త్రీయ

## మనిషిలో అన్నిటికంటె గొప్ప సుగుణం

"తప్పులు చెయ్యకపోవడం గొప్ప వరంగా మహర్షులు భావించలేదు. పైపెచ్చు - ఎప్పటికప్పుడు తను చేసిన తప్పులు తెలుసుకుంటూ వాటిని సరిదిద్దుకుంటూ ఇంకా ఇంకా ఉదాత్తుడుగా మారడమే మనిషిలో అన్నిటి కంటె గొప్ప సుగుణంగా వారు భావించారు." —వాంగ్ యాంగ్-మిన్

పరిశోధనలు సాగించడంలోనే జీవితం అంతా గడిపారు.

మధుమేహ వ్యాధి రావడానికి కారణాలను గూర్చి పరిశోధిస్తూ ఉండగా ఆయనకు 'పిట్యూటరీ గ్రంథి' (సాంకేతిక భాషలో



'హైపో ఫైసిస్) విషయమైన ఆసక్తి కలిగింది. డా॥ హౌస్సే పరిశోధనలకు పూర్వం వైద్యు లందరూ జఠర గ్రంథి (Pancreas) దెబ్బ తిని, చక్కెర పదార్థాలను జీవశక్తిగా మార్చేందుకు అవసరమైన 'ఇన్సులిన్'ని తగినంత ప్రమాణంలో సరఫరా చేయక పోవడం వల్లనే మధుమేహ వ్యాధి వస్తుందని భావిస్తూ ఉండేవారు. మధుమేహం రావడానికి ఒక్క జఠర గ్రంథి మాత్రమే కారణం కాదేమో అనీ, పిట్యూటరీ గ్రంథికి కూడా దీనితో ప్రమేయం ఉందేమో అనీ హౌస్సేకు లీలగా అనిపించింది.

తన ఊహ సరియైన దని రుజువు చేసేందుకు లేబరేటరీలో రెండు వర్గాల జంతువుల మీద ఆయన రెండు రకాల ఆపరేషన్లు చేసి చూశారు. ఒక వర్గం జంతువులలో జఠర గ్రంథిని మాత్రమే తొలగించారు. రెండో వర్గం జంతువులలో జఠర గ్రంథితో పాటు పిట్యూటరీ గ్రంథి ముందు భాగంలోని బొడిపెలు (lobes) కూడా తొలగించారు. మొదటి వర్గం జంతువుల కంటె రెండో వర్గం జంతువులు ఎక్కువ కాలం జీవించాయి. దీని వల్ల ఒక జంతువులో జఠర గ్రంథి లోపించి 'ఇన్స్యులిన్' సరఫరా కాక పోయినా దానితో పాటు పిట్యూటరీ గ్రంథిలోని ముందరి బొడిపెలు కూడా లోపిస్తే దాని శరీరంలో చక్కెర పదార్థాలు జీవశక్తిగా మారే ప్రక్రియ ఏదో విధంగా కొనసాగుతూనే ఉంటుంది అని స్పష్టం అయింది.

ఆ తరువాత డా. హౌస్సే ఆరోగ్యంగా ఉన్న ఒక జంతువు రక్తంలోకి పిట్యూటరీ గ్రంథి స్రావాన్ని ఎక్కించి చూశారు. వెంటనే ఆ జంతువులో మధుమేహ వ్యాధి లక్షణాలు కనిపించాయి. ఆ జంతువు జఠర

## 'స్వేచ్ఛ' కొరవడిన అభాగ్యులు

"ఎవరిలో మత విశ్వాసం కంటె అపేశానిది పై చేయి అవుతుందో వారికి 'స్వేచ్ఛ' లేదు. ఎవరిలో 'జ్ఞానం' కంటె 'అజ్ఞానం' ప్రబలంగా ఉంటుందో వారికి 'స్వేచ్ఛ' లేదు. ఎవరిలో తమను తాము సంబాళించుకునే నేర్పు శూన్య మో వారికి స్వేచ్ఛ లేదు!" —హెన్రీ వార్డ్ బీచర్

"ఆకలి రుచి ఎరుగదు; నిద్ర సౌఖ్యం ఎరుగదు." తెలుగు సామెత

గ్రంథి నిక్షేపంగా ఉన్నా పిట్యూటరీ గ్రంథి స్రావంవల్ల శరీరంలో చక్కెర పదార్థాల వినియోగం దెబ్బ తిన్నదన్న మాటః అంటే డా. హౌస్‌సే ఊహించినటు మధుమేహ వ్యాధిని కలిగించడంలో పిట్యూటరీ గ్రంథి పాత్ర ఉన్నదన్నమాటే గదః అందుచేత డా॥ హౌస్‌సే ఇలా నిర్ణయించాడు: "పిట్యూటరీ గ్రంథి ముందరి బొడిపెల నుంచి వచ్చే స్రావం శరీరంలో చక్కెర పదార్థాలు జీర్ణం కాకుండా అవరోధం కలిగిస్తుంది. చక్కెర పదార్థాలు జీర్ణం అయే ప్రక్రియలో ఇన్సులిన్‌కి ప్రత్యక్షమైన సంబంధం లేదు. పిట్యూటరీ గ్రంథి నుంచి వెలువడే విషపూరితమైన స్రావానికి విరుగుడుగా మాత్రమే ఇన్సులిన్ ఉపయోగిస్తుంది." పిట్యూటరీ గ్రంథిని గురించి ఆయన చేసిన పరిశోధనలకు గుర్తింపుగా 1947 లో వైద్య నిపుణులకు ఇచ్చే నోబెల్ బహుమతిని డా. కార్ల్ ఎఫ్. కోరీ, డా. గెర్టీ కోరీలతో సంయుక్తంగా డా. హౌస్‌సేకు ఇచ్చారు.

న్యాయశాస్త్రంలో ప్రొఫెసర్ అయిన ఒక ఫ్రెంచ్ జాతీయుని కడగొట్టు బిడ్డగా 1887 ఏప్రిల్ 10 న అర్జెంటీనాలో డా. హౌస్‌సే జన్మించారు. 6 ఏళ్ళపాటు చదువ వలసిన గ్రామర్ స్కూల్ చదువును 2 ఏళ్ళలోనే ఆయన ముగించారు. 13 ఏళ్ళకే హైస్కూల్ చదువు ముగించి, తన 17 వ ఏట 'ఫార్మసీ కాలేజ్'లో పట్టభద్రు లయ్యారు. 22 వ ఏట బ్యూనస్ ఎయిర్స్ యూనివర్సిటీ మెడికల్ స్కూల్‌లో ప్రొఫెసర్ అయారు. 1911 లో ఎం.డి. పట్టం పొందారు. 1919 లో తన 32 వ ఏట 'శరీర శాస్త్రం' (physiology) విభాగాని కంతకూ అధిపతి(head) అయారు.

శరీర శాస్త్రం, శారీరక రసాయన శాస్త్రం, జీవరసాయన శాస్త్రం (bio - chemistry), ఫార్మకోలజీ, ఔషధ శాస్త్రం (exprimental medicine) మొదలైన వాటిని గూర్చి పరిశోధనలు జరిపేందుకు డా. హౌస్‌సే నెలకొల్పిన లేబొరేటరీ అనతి కాలంలోనే ప్రపంచం అంతటా ప్రసిద్ధి పొందింది.

పిట్యూటరీ గ్రంథిని గురించిన తొలి' ఆవిష్కరణ'ను (discovery) డా. హౌస్‌సే 1924 లో ప్రకటించారు. తరువాత ఆ

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద పాము



'ఆనకొండా' అనబడే ద. అమెరికాలోని ఒక కొండ చిలువ రకం పాము ప్రపంచంలో మిక్కిలి పెద్దది. అది తన ఎర (victim) తాలూకు శ్వాసనాళాన్ని నొక్కి చంపి వేయడానికి నిముషం కూడా పట్టదు. తన 'ఎర' తనను తిరిగి కరవడానికి వీలులేకుండా దాని మెడను ముందుగా అది పట్టుకుంటుంది.

"కడుపు మాడేవాడు దేవుణ్ణి పూజించలేడు!" —డబ్ల్యు. విల్సన్

సంగంలో అనేక ఆవిష్కరణలు జరిపి, 'మానవ శరీరశాస్త్రం' (Human Physiology) అనే సుప్రసిద్ధ పాఠ్యగ్రంథం కూడా ఆయన వ్రాశారు.

క్లాసులో గాని, లేబొరేటరీలో గాని డా॥ హౌస్‌సే నిర్మొహమాటంగా వ్యవహరించే వారు. శాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధిపరచడమే ఆయన పరమ ధ్యేయం. సైన్స్ విషయంలో యథాలాపంగా ఆసక్తి చూపేవారిని ఆయన ఏమాత్రం సహించలేకపోయేవారు. డా॥ హౌస్‌సే పేపర్లు దిద్దితే విద్యార్థులకు క్షుణ్ణంగా విషయం తెలిసి ఉండాలి. లేకపోతే ఎంతటి రాజకీయ పలుకుబడి గల విద్యార్థులైనా ఫెయిల్ కావడం ఖాయం! ఒకప్పుడు ఆయన వల్ల పరీక్ష తప్పి అసంతృప్తి చెందిన ఒక విద్యార్థుల గుంపు కుళ్ళిన టొమాటాలతో ఆయనను కొట్టారు. అయినా ఆ విషయంలో ఆయన పట్టుదల రవ్వంత కూడా సడల లేదు.

ఇంగ్లీష్, ఫ్రెంచ్, జర్మన్, స్పానిష్ భాషలు చక చకా మాట్లాడే డా. హౌస్‌సే మంచి స్నేహశీలి! ఆయన జ్ఞాపకశక్తి అసాధారణమైంది. చిన్నప్పుడు తనకు తన తండ్రి చదివి వినిపించిన విక్టర్ హ్యూగో రచనల నుంచి సుదీర్ఘ భాగాలను ఆయన వప్పగించేవారు. మారియా ఆంజెలికా కాటాన్‌తో 1920 లో ఆయనకు వివాహం జరిగే నాటికి ఆమె ఒక 'కెమిస్ట్‌గా' పని చేస్తూ ఉండేది. పాముల మీద ఆయన పరిశోధనలు చేస్తున్న రోజులలో ఆమెతో ఆయనకు పరిచయం అయింది భార్యతో కలసి నిరాడంబరంగా ఆయన జీవితం గడిపారు.

లాటిన్ అమెరికా దేశాలలో నోబెల్ బహుమతి అందుకున్న మొట్టమొదటి శాస్త్రవేత్త డా. హౌస్‌సే! ఆయన ప్రజాస్వామ్య సమర్థకుడు కావడంవల్ల అర్జంటీనా నియంత జువాన్ పెరోన్ నోబెల్ బహుమతి వచ్చినందుకు ఆయనను అభినందించలేదు. అర్జంటీనాలోని కొన్ని పత్రికలు ప్రభుత్వం మెప్పు కోసం ఆయన పరిశోధనల మౌలికత (originality) నూ, విలువనూ ప్రశ్నిస్తూ కూడా వ్రాశాయి.

విదేశీ విశ్వవిద్యాలయాల నుంచి ఎంతటి ఆకర్షకమైన ఆహ్వానాలు వచ్చినా నిరాకరించి, తన సంతవాణ్ణి చేసిన తన జన్మభూమి అర్జెంటీనాకే తన పరిశోధనల ఫలితాలు దక్కాలని అక్కడే ఆయన తన లేబొరేటరీ నెలకొల్పుకున్నారు.

అర్జెంటీనా నియంత కాదన్నా, ప్రపంచమంతా డా హౌస్‌సేకు నివాళు లర్పించింది!

---

## భారతీయునికి 'మాన్ ఆఫ్ ది వరల్డ్' అవార్డు

'ఒబెరాయ్ హోటల్' యజమాని మోహన్ సింగ్ ఒబెరాయ్‌కి న్యూయార్క్‌లోని 'మాన్ ఆఫ్ ది వరల్డ్' అవార్డు లభించింది. 1983 వ సంవత్సరంలో హోటల్ యజమానులలో మిక్కిలి ప్రముఖుడుగా ఆయనను ప్రకటించారు. వర్ధమాన దేశాల నుంచి ఒక హోటల్ యజమాని ఈ అవార్డు అందుకోడం ఇదే మొదలు. ఒబెరాయ్ ప్రస్తుతం 10 వేర్వేరు దేశాలలో 26 హోటళ్ళు నడుపుతున్నారు.

---

"మానవజాతి మనుగడ ఎప్పుడూ కష్టభూయిష్ఠమే!" —ఎల్. మమ్‌ఫర్డ్

# నిజాలు-నిదర్శనాలు

## 'కోకాకోలా' కనిపెట్టిన ఘనుడు:

ఇవాళ కోట్లాది మందికి ప్రీతి పాత్రమైన కోకాకోలా పానీయాన్ని మొట్టమొదట తయారుచేసిన వ్యక్తి జార్జియా (అమెరికా) లోని జాన్ ఎస్. పెంబెర్టన్ అనే ఒక కెమిస్టు. 1866 లో తమ దొడ్లో ఒక పీపాడు కోకాకోలా పానీయం మొదట ఆయన తయారు చేశారు. చాలా రోజులు జార్జియా వాసులకు తప్ప ఇతరులకు దానిని గురించి తెలియదు. 1916 లో ప్రత్యేకమైన ఆకారం గల సీసాలలో భారీ ఎత్తున దానిని సరఫరా చెయ్యడం ఆరంభమైంది.

* * *

## లండన్ గంట కూలితే....?

లండన్‌లో వెస్ట్‌మినిస్టర్‌లోని పెద్ద గంట తాలూకు మధ్య ఉండే నాలుక (clapper) 1666 సెప్టెంబరు 24 న ఉన్నట్టుండి నేల కూలింది. ఆ క్షణం నుంచే 'ప్లేగ్' వ్యాధి వెనుక బడడం ఆరంభమైందని అక్కడి ప్రజల నమ్మకం!

* * *

## నడిచేటప్పుడు 8 రెట్లు కేలరీల ఖర్చు:

కూచుని ఏ ఉత్తరమో వ్రాసుకుంటున్నప్పటి కంటె నడిచేటప్పుడు మనిషిలో 8 రెట్లు ఎక్కువ కేలరీల శక్తి ఖర్చవుతుంది.

## చేతితో పైకెత్త వీలైన మినీ కారు



హాంబర్గ్ (ప.జర్మనీ) సమీపంలోని లోప్టిన్‌లో 'క్లైస్ ఆర్నెడ్ట్' అనే సంస్థవారు తయారుచేసిన 'మినీ మొబిల్' అనే మిక్కిలి చిన్న కారును చేతితో పైకెత్తి పార్కింగ్ స్థలంలో పెట్టవచ్చును. 50 ఘ. సెం.మీ.ల పరిమాణం గల దీని ఇంజన్ గంటకు 25 కి.మీ.ల వేగంతో మాత్రమే పోవడానికి వీలవుతుంది. 3 లీటర్ల పెట్రోల్‌తో 100 కి.మీ. ల దూరం ఈ కారు నడుస్తుంది.

"పరాయివారి ఆరోగ్యం కోసం అని మధువు త్రాగకు!
నీ ఆరోగ్యాన్ని నీవు కోల్పోతావు."

## మిక్కిలి తక్కువ వ్యవధి విమాన సర్వీసు:

ప్రపంచంలో మిక్కిలి తక్కువ కాలం పట్టే విమాన సర్వీసు ఆర్క్నీ దీవులకూ, పాపా వెస్ట్రేకూ మధ్య నడుస్తూంది. ప్రయాణానికి కేవలం 69 సెకనులు మాత్రమే పట్టే ఈ విమాన సర్వీసు 1967 సెప్టెంబరులో ఆరంభ మైంది.

## పరుగు పందెం



పాపువా న్యూగినియా దేశం 1979 లో ప్రపంచంలో మిక్కిలి దుర్లభమైన 95 కి. మీ.ల దూరం పరుగెత్తే పరుగుపందెం నిర్వహించింది. రెండురోజులు పట్టే ఆ పరుగు పందెంలో పాల్గొనే పోటీదారులు నిటారుగా జారుతూ ఉండే కొండలు ఎక్కాలి. అతి వడిగా పారే వాగులు దాటాలి: సరస్సులలో నివసించే దోమల, జలగల బెడదలకు తట్టుకోవాలి.

## మేగ్నాకార్టా మీద వేలిముద్ర:

ఇంగ్లండు రాజు జాన్ (1199-1216) కి సంతకం పెట్టడం రాదు. అందుచేత 'మేగ్నా కార్టా' అనే సుప్రసిద్ధ హక్కుల పత్రం మీద ఆయన వేలిముద్ర వేశారు.

(7 వ పేజీ తరువాయి)

## 'నేపిల్స్ దర్శించి కన్ను ముయ్యండి!':

విమానం నేపిల్స్ నగరంమీదుగా ఎగురుతూంది. ఎయిర్ హోస్టెస్ ప్రయాణీకులతో అంది: "నేపిల్స్ దర్శించి కన్ను ముయ్యండి!" అనే సామెత మీరు వినే ఉంటారు. ఇదే ఆ నేపిల్స్ నగరం. బాగా చూడండి. విమానం ఇంజన్లు దెబ్బ తిన్నాయి. కొద్ది క్షణాలలో విమానం కూలి పోవచ్చు!"

## జీవన వ్యయం లెక్కించే పద్ధతి:

"జీవన వ్యయాన్ని నమ్మకంగా లెక్కగట్టే పద్ధతి మీకేమైనా తెలుసా?"

"ఏ ముందండీ? ఎవరి ఆదాయమైనా తీసుకోండి - దానిలో 20 శాతం దానికి కలపండి - అదే ఆ వ్యక్తి జీవన వ్యయం!"

"నెలాఖరు రోజులలో బ్రదికినట్టు నెల మొదటి వారంలో కూడా జీవించడంలో ఉంది 'పొదుపు' కీలకం"

# పోటీలు

అగస్టు 1984

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు ఠావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: అగస్టు **20, 1984**. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్‌డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'సహ జీవనం' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## గబ్బిలాలకు గల రాడార్



పక్షులలో స్తనంధయజాతి(mammals)కి చెందిన ఏకైక పక్షి గబ్బిలం. కంటిచూపు బాగా ఆనకపోయినా, గాఢాంధకారంలో కూడా అతి సులువుగా అది పయనించగలదు. దానిలో ఒక విధమైన 'రాడార్' శక్తి ఉంది. ఎగిరేటప్పుడు తెరచి ఉన్న దాని నోటి నుంచి సెకన్‌కి 30 మొదలు 60 కీచు కేకలు వెలువడుతాయి. ఆ ధ్వనులకు ఏదైనా వస్తువు అడువస్తే అవి వెంటనే ప్రతిధ్వని రూపంలో గబ్బిలం చెవిని బడతాయి. ఆ ప్రతిధ్వనుల వల్ల అది ఏ వస్తువు ఎక్కడ ఉన్నదీ గ్రహించగలదు.

"గృహమే కదా స్వర్గసీమ!"

## క్విజ్

1. పార్లమెంట్‌ను ఇండియాలో ఏమంటారు? 2. 'పిల్లీ పాయింట్' అనే మాట ఏ ఆటలో వాడుక చేస్తారు? 3. ఫ్రాన్స్‌లో వాడుకలో ఉన్న నాణెం ఏది? 4. ఇండియా జాతీయ పక్షి మీకు తెలుసా? 5. 'లెడ్ పెన్సిల్'లో 'లెడ్' (సీసం) ఉందా? 6. బాల గంగాధర తిలక్ బిరుదం ఏమిటి? 7. గత శతాబ్దిలో భాషలు తర్జుమా చేసి చెప్పే వారిని ఏమనేవారు? 8. పడమటి దిక్కుకు అధిపతి ఎవరు?

## పజిల్




ఆధారాలు — అడ్డం: 1. 'పానుగంటి' వ్రాసిన ప్రసిద్ధమైన రామ నాటకం, 5. 'వీరితో వైరం సహజం' ఎవరితో? 8. '— వృత్తి కఠోరమైంది' ఏ వృత్తి? 9. కత్తి కంటె బలమైంది, 10. రోజు రోజుకీ ఆకాశాన్ని అంటుతున్నాయి — ఏవి? 11. రాముడు ఎవరి విల్లు విరిచాడు? 13. జారిన, 15. చలనం లేని, 16. వేశ్య పస, 18. తిక్కతో కూడిన రుక్మిణి.

నిలువు: 1. రణం లేని పారిజాతాపహరణం, 2. 'మేఘ సందేశం' వ్రాసిన కవి, 3. 'అప్పుడు ఇండియాలో పిండారీల, థగ్గుల, —' బాధ హెచ్చుగా ఉండేది, 4. యాదవ కులంలో చివరికి పుట్టింది, 6. భారతంలో భానుమతి ఎవరి సతి?, 7. నరుల కంటె వానరులు విశేషంగా ఏవి కలవారు? 12. 18 అడ్డంలో చివరి 3/5 వ వంతు, 14. పులియ బెట్టిన గంజి మీది నీటిని ఏమంటారు? 16. తెలంగాణా వారు 'అది' ని ఎలా పలుకుతారు? 17. 9 అడ్డానికి ప్రతిస్పర్థి.

---

## మీరైతే?

(జూన్ 1984)



(రాజీవ్ గాంధీ స్థానంలో ఉంటే?)

"కుళ్ళు రాజకీయాలకు గుడ్ బై కొడతా!"

—తూనుగుంట్ల కోటేశ్వర్రావు, హైదరాబాదు.

* * *

"ఆగండి - అమ్మను అడిగి చెప్తాను!"

—ఎస్. వి. ప్రసాద్, న్యూ పాలంచ.

* * *

"వద్దండి బాబోయ్!
నా రిజర్వేషన్ సౌకర్యం పోతుంది!"

—జి. రవి, మెహబూబ్ నగర్.

"ఎవరి ఇల్లు వారికి కోట!" —సర్ ఎడ్వర్డ్ కోక్

## తెలివికి పరీక్ష

1. 'టరుపెగు గుటరువి కేకొఱ' అక్షరాలు గజిబిజి అయిన ఈ మాటలలో నుంచి ఒక తెలుగు సామెతను గుర్తించగలరా? 2. చెట్టు మీద 100 కాకులు ఉన్నాయి. వేటకాడు తుపాకి పేల్చి ఒక కాకిని వధించాడు. అక్కడ ఇంకెన్ని కాకులుంటాయి? 3. బియ్యం నుంచి తయారయే మాదక పానీయం ఏది? 4. 'బూరె' లోపల ఉండే తియ్యని పదార్థాన్ని ఏమంటారు? 5. రైతుకి మిక్కిలి సాయం చేసే ప్రాణి ఏది? 6. క్నే.వి,సు,డు, — గజిబిజి అయిన ఈ అక్షరాలకు మరో అక్షరం చేర్చి ఒక దేవుణ్ణి దర్శించగలరా? 7. ఎక్కడ ఎక్కువ ఉడక పోస్తుంది? (ఏ) అడవిలో, (బి) కొండ మీద, (సి) సముద్ర తీరాన (డి) ఎడారిలో, 8. తెలుపు, నలుపు. వేలుపు, ఎరుపు, కారపు, తీపి — వీటిలో నప్పని మాట గుర్తించండి.

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. అజాత శత్రువు: (ఏ) దుర్యోధనుడు, (బి) వ్యాసుడు, (సి) ధర్మరాజు, (డి) సహదేవుడు.

2. అజినము: (ఏ) జైన మతానికి సంబంధించినది, (బి) జింక మొదలైన వాని చర్మము, (సి) బౌద్ధారామం. (డి) యుద్ధానికి సంబంధించింది.

3. అజుడు: (ఏ) మేక, (బి) బ్రహ్మ, (సి) మన్మథుడు, (డి) జకారం లేనివాడు.

4. అట్టాలిక: (ఏ) కాశీరాజు కూతురు, (బి) బాలిక, (సి) రాజ భవనం, (డి) మరుగుజ్జు స్త్రీ.

5. అడుసు: (ఏ) ఇసుక. (బి) నలుసు, (సి) బురద, (డి) పంకజం.

6. అడ్డబాస: (ఏ) ప్రతి శపథము, (బి) ఒక రకమైన భాష, (సి) బులాకీ, (డి) అడ్డు చెప్పడం.

## కోడి గ్రుడ్డు ఆహారపు విలువ



ప్రపంచం అంతటా సర్వ సాధారణం అయిన ఆహారపదార్థంగా వాడబడే కోడి గ్రుడ్డులో 8 విధాలైన 'బి' విటమిన్‌లు ఉన్నాయి. రిబో ఫ్లావిన్, తియామిన్ కూడా పుష్కలంగా ఉన్నాయి. 50 గ్రాముల బరువుండే గ్రుడ్డులో శరీరానికి అవసరమైన అన్ని పోషక పదార్థాలూ నిక్షిప్తమై ఉన్నాయి.

"బ్రహ్మదేవుని ఉదాత్తసృష్టి: నిజాయితీ పరుడు." -పోప్

7. అతనుడు: (ఏ) అతడు, (బి) మన్మథుడు, (సి) ఒక ఋషి, (డి) గొప్పవాడు.

8. అతిథి: (ఏ) తద్దినం, (బి) వారం (సి) ఇంటికి వచ్చిన వ్యక్తి, (డి) తిథి కానిది.

విస్డమ్
పోటీల సూచన
అగస్టు 1984

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి।

## మీరైతే......?

"ప్రపంచం అంతటిలోకీ మిక్కిలి ధనవంతులైతే?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి

## భావపరిచయం చెయ్యాలి!



8 మాటలకు మించకుండా పైన కని పిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి

---

## యాలకుల ఉత్పాదనలో కేరళ ముందంజ!

1982-83 సం.రం.లో ఇండియాలోని యాలకుల ఉత్పత్తి 2,900 టన్నులు. వీటిలో కేరళ పండించిన యాలకులు 1,900 టన్నులు. 800 టన్నులు పండించిన కర్ణాటక రెండో స్థానంలోనూ, 200 టన్నులు పండించిన తమిళనాడు మూడో స్థానంలోనూ ఉన్నాయి.

---

" 'నిజాయితీ' కంటె 'మోసం' ఎక్కువ విజయం సాధించలేదు "—షేక్స్పియర్

# పోటీ

(జూన్ 1984)

వ్యాసం - మొదటి బహుమతి: బి వి. పంతులు, పార్వతీ పురం, విజయనగరం జిల్లా; రెండవ బహుమతి: పి. మోహన్, కోరుకొండ, విజయనగరం జిల్లా; మూడవ బహుమతి: వి పి. నరసింహారెడ్డి, గుంటూరు.

- జవాబులు: 1 రాగి, టిన్ కలిపి కంచు తయారు చేస్తారు, 2 ఛార్లెస్ డార్విన్, 3. అరింవా, 4 శ్రీ-సాలీడు, కాళ-సర్పం, హస్తి-ఏనుగు — ఈ మూడింటి చేతా ఆరాధించబడిన ఈశ్వరుని క్షేత్రం గనుక అది 'శ్రీ కాళహస్తి' క్షేత్రం అయింది. 5. 1.677 మీటర్లు, 6 ఒక్కటే — అది చంద్రుడు. 7. కుమారస్వామి, 8. ఇండియాలో 'అర్జున్' అవార్డును అత్యుత్తమ క్రీడాకారునికి, లేదా క్రీడాకారిణికి ఇస్తారు.

విజేతలు - రెండవబహుమతి: సి. వి. సుశీల, శ్రీకాకుళం: మూడవ బహుమతి: కె. వి.వి.వి.ఎస్.ఎస్. గుప్త, విశాఖపట్టణం.

పజిల్-జవాబులు-అడ్డం: 1. ఏకవీర, 3. చిత్రాంగద, 5. సాగరం, 6. గులాబీలు, 8. లలి, 9. సావిత్రి పతి, 11. పాబు హత్య, 12. బాట, 13. కిరాత వధ, 16. వలువకే:, 18 తగును, 19. రుక్మిణికి, 20. జలగము.

నిలువు: 1. ఏనుగుల, 2. రసాలు, 3. చిరంజీవి, 4. దమయంతి, 7. లాలిపాటలు, 9. సాత్యకి, 10. పడవ. 12. బావగారు, 14. రామానుజ:, 15. ధవళము, 17. కేతకి.

విజేతలు - మొదటి బహుమతి: ఏ. మధుర మీనాక్షి, కడప; రెండవ బహుమతి: ఏ. కె వేణి, ఖమ్మం; మూడవ బహుమతి: లలితాదేవి.కల్వకుర్తి, మహబూబ్‌నగర్ జిల్లా.

## మట్టికి పోషక పదార్థాలు అందజేసే చెదపురుగులు



చీమలను పోలి ఉండే తెల్లని చెదపురుగులు కొయ్యలను తింటాయి. కొయ్యలోని సెల్యులోజ్ (వృక్ష జీవకణం పైపొరను) ఇవి జీర్ణం చేసుకోడం ద్వారా మట్టికి పోషక పదార్థాలను సరఫరా చేస్తాయి. ఈ చెదపురుగులు సెల్యులోజ్‌ను ప్రత్యక్షంగా కాక, వాటి ప్రేవులలోని సూక్ష్మక్రిముల ద్వారా జీర్ణం చేసుకుంటాయి.

"శ్రమించడంలోనే ఉంది సిసలైన గౌరవం!" —జి. క్లీవ్‌లండ్

తెలివికి పరీక్ష — జవాబులు: 1. IX (తొమ్మిది) లో I (ఒకటి) తీసేస్తే — X (పది) మిగులుతుంది; 2. 12, 34, 45, 56, 67, 78, 89, 3. గొల్లభామ, 4. 'భేదము' రైటు, 5. 90, 98 (పూర్వ సంఖ్యకు 3, 4, 5, 6....ఇలా కలుపుతూ పోతే తరువాతి సంఖ్య వస్తుంది), 6. 'స', 7. సల్గొండ, 8. కాదు (శాస్త్రవేత్తలు ప్రయోగాలు చేసి ఇది అబద్ధం అని తేల్చారు).

విజేతలు - మొదటి బహుమతి: శ్రీమతి టి వత్సలా బాయి, సిరికొండ, నిజామాబాద్ జిల్లా; రెండవ బహుమతి: గుంటి జయకర్, చందర్లపాడు, కృష్ణాజిల్లా; మూడవ బహుమతి: ఎన్. భాస్కర్, దోమకొండ, నిజామాబాద్ జిల్లా.

మాటల మహిమ - జవాబులు: 1. కన్ను (ఏ), పాచిక (బి), ఇరుసు (డి), 2. వర్ణము (బి), ఆకాశము (సి), 3. కన్ను (ఏ), 4. సేనా విశేషము (బి), అక్షోహిణి (డి), 5. సంపూర్ణము (బి), ఎప్పుడూ ఆరకుండా వెలిగే దీపము (డి), 6. కష్టాలు (సి), 7. పార్వతి (బి), 8. కందకము (బి), పరిఖ (డి).

విజేతలు - మొదటి బహుమతి: సి. శేషకుమారి, పెనుకొండ, అనంతపురం జిల్లా; రెండవ బహుమతి: కె. ఎల్. కామేశ్వరరావు, గుంటూరు; మూడవ బహుమతి: శ్రీమతి బి. జానకీదేవి, మధురానగరి, హైదరాబాదు-500 981.

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి: కె. రవిశంకర్, హిందూపూర్, అనంతపురం జిల్లా; రెండవ బహుమతి: కే. మేలగిరిరావు, నారాయణపేట; మూడవ బహుమతి: బత్తుల గోవిందరావు, సరియాపల్లి-532 291.

పాఠకుల అభిప్రాయాలు - మొదటి బహుమతి: వాసిరెడ్డి వేణుగోపాల్, జగ్గయ్యపేట, కృష్ణా జిల్లా; రెండవ బహుమతి: జి. లక్ష్మీనారాయణ, ఉలిచి, ప్రకాశం జిల్లా; మూడవ బహుమతి: మొలుగు కమలాకాంత్, విస్సన్నపేట, కృష్ణా జిల్లా.

మీరైతే? - మొదటి బహుమతి: తూనుగుంట్ల కోటేశ్వరరావు, హైదరాబాదు; రెండవ బహుమతి: ఎస్. వి. ప్రసాద్, న్యూ పాలంచ-507 115; మూడవ బహుమతి: జి. రవి, మెహబూబ్ నగర్.

భావ పరిచయ పోటీ - మొదటి బహుమతి: ఎమ్. సునీత్ కుమార్, చిలుకలూరిపేట; రెండవ బహుమతి: బి. వి. ఆర్. భాస్కరరావు, కుంకలగుంట, గుంటూరు జిల్లా; మూడవ బహుమతి: పి. ఆర్. హరినాథ్, అనంతపురం.

## 'థార్' ఎడారిలో నదులు

పూనెలోని దక్కన్ కళాశాల ప్రొఫెసర్ బి. ఎస్. మిశ్రా కథనం ప్రకారం 10 లక్షల ఏళ్ళ క్రితం 'థార్' ఎడారి గుండా పలు నదులు పారుతూ ఉండేవి. అవి ఎండిపోయినప్పుడు ఆ నదులలోని రాళ్ళతో అక్కడి ప్రజలు పరికరాలు నిర్మించుకున్నారు. పురాతత్త్వ పరిశోధకులకు ఆ రాతియుగం నాటి పరికరా లెన్నో అక్కడ లభించాయి

"నువ్వు నీకంటె భిన్నంగా ఉండాలని చూడకు
నీలాగ ఉండడంలోనే పరాకాష్ఠ సాధించు!" —సెంట్ ఫ్రాన్సిస్ డీ సాలీస్

